# మా స్వంతప్రచురణములు.

## ఆంధ్రదేశమందు ప్రదర్శింపఁబడు నాటకరత్నములు.

| | | | |
|---|---|---|---|
| శ్రీకృష్ణతులాభారము ము. సు. | 1-0 | చంద్రగుప్త నం. శి. | 1-0 |
| రంగూన్‌రౌడీ సో. రా. | 1-0 | రాణాప్రతాప్ జ. శి. | 1-0 |
| ధరణికోట (రెడ్లప్రతాపము) | 1-4 | దుర్గాదాసు డిటో | 1-0 |
| భోజకాళిదాసు డిటో | 1-0 | జయంతజయపాలం ఆ. స. | 0-12 |
| సతీ అనసూయ డిటో | 1-0 | బలిబంధనము చ. కే. | 1-0 |
| సతీసక్కుబాయి డిటో | 0-12 | రాధాకృష్ణ పా. ల. | 0-12 |
| గంగావతరణము డిటో | 1-0 | పాదుకాపట్టాభిషేకం | 1-4 |
| మహాభక్తవిజయము డిటో | 1-0 | విప్రనారాయణ | 1-0 |
| భీష్మబ్రహ్మచారి డిటో | 1-0 | సత్యహరిశ్చంద్రీయం బ. ల. | 1-0 |
| కాలకేతనము డిటో | 1-0 | బుద్ధిమతీవిలాసము డిటో | 1-0 |
| ప్రతాపరుద్రీయము డిటో | 1-0 | చండిక ము. వే. | 1-0 |
| తాజ్ మహల్ డిటో | 1-0 | సావిత్రి శ్రీ. స. | 1-0 |
| సంగీత శశిరేఖ డిటో | 0-12 | శ్రీరామాంజనేయం పి. చి. | 1-0 |
| మారుతి మైరావణ డిటో | 0-12 | పత్నీప్రతాప్ అనసూయ సో. అ. | 1-0 |
| ద్రౌపదీవస్త్రాపహరణం మ. అ. | 1-0 | కృష్ణలీల బళ్లారి కె. సు | 1-4 |
| శ్రీకృష్ణలీలలు డిటో | 1-0 | లవకుశ డిటో | 1-4 |
| చింతామణి కా. నా. | 1-0 | రామదాసు బళ్ళారి డి. గో. | 1-0 |
| మధుసేవ డిటో | 1-0 | సంపూర్ణమహాభారతము | 1-0 |
| రసపుత్రవిజయం ఇ. య. | 1-0 | రాధాకృష్ణ సాంగ్సు చం. కే. | 0-12 |
| రాణాప్రతాప్‌సింగ్ డిటో | 1-0 | తులాభారం సాంగ్సు డిటో | 0-12 |

## ఆంధ్ర నాటకములు.

| | | | |
|---|---|---|---|
| శాంతామతి బ. కో. | 0-12 | భక్తకబీర్ కొ. స. | 1-0 |
| సంపూర్ణరామాయణము | 1-0 | పాదుకాపట్టాభిషేకం | 0-8 |
| కోమసార, జవ్వారీబాయి | 0-12 | సంగీతసావిత్రి చె. వే. | 0-8 |
| శ్రీకృష్ణరాయబారం | 0-12 | రాధాకృష్ణలీల కం. వేం. | 0-12 |
| శ్రీమతీజవి శ్రీ. తి. | 1-0 | వృద్ధవివాహము గో. వేం. | 0-12 |
| సారంగధర కా. గో. | 0-8 | శ్రీ కృష్ణతులాభారంకొ. వ్యా. | 0-8 |




(ఐదంకముల పురాణనాటకము.)



ఇది

విశాఖపట్టణ వాస్తవ్యులగు,

కీ. శే. సన్నం కన్నయాచార్యులుగారిచే

రచింపఁబడినది.

ప్రకటనకర్త:

కురుకూరి సుబ్బారావు,

సరస్వతీబుక్ డిపో, బెజవాడ.



మొదటికూర్పు 1000 ప్రతులు.



కాకినాడ:

కాకినాడ ముద్రాక్షరశాలయందు

ముద్రింపబడియె.

1935.

 [వెల 0—12—0.

# ఇందలి పాత్రలు

—: పురుషులు :—

విఘ్నేశ్వరుడు—పార్వతీ మానసపుత్రుడు

ఈశ్వరుడు—త్రిమూర్తులలో నొకడు

కృష్ణుడు—యాదవచక్రవర్తి

సత్రాజిత్తు—శ్రీకృష్ణుని మామ

ప్రసేనుడు—సత్రాజిత్తు తమ్ముడు

కైరవుడు—<br>
కౌశికుడు— } కృష్ణ సత్రాజిత్తుల మిత్రులు

శతధన్వుడు—ఒకరాజు, సత్రాజిత్తు మిత్రుడు

భృంగి—ఈశ్వరానుచరుడు

చంద్రుడు—ఈశ్వర శిరోభూషణుడు

రామశాస్త్రి—<br>
కామావధాని— } బ్రాహ్మణులు

వీరుడు—<br>
శూరుడు. } శివానుచరులు

నందుడు—ఒక యాదవుడు

జాంబవంతుడు—భల్లూకరాజు

వీరుకాక బ్రహ్మ, మంత్రి, యముడు యాదవులు సేవకులు మొదలగువారు సమయానుకూలముగా వత్తురు.

—: స్త్రీలు :—

పార్వతి—ఈశ్వరుని భార్య

జాంబవతి— జాంబవంతుని కుమార్తె<br>
సత్యభామ—సత్రాజిత్తు కుమార్తె } కృష్ణుని భార్యలు

చంచలాక్షి—<br>
చకోరాక్షి— } సత్యభామ చెలులు

కాళి—దేవత.

# శ్రీకృష్ణప్రతిజ్ఞ

## ప్రథమాంకము.



### రంగము 1.

ప్రదేశము—కైలాసమందిరము.

[ప్రవేశము—పార్వతీ—విఘ్నేశ్వరులు.]

పార్వ—(విఘ్నేశ్వరుని ముద్దాడి) కుమారా !

(అనుబంధము 1.)

గీ. చిన్నిశూలంబు చేఁబూని కన్నతండ్రి !
ద్వారమును దాటి లోనికెవ్వానినైన
విడువకయె నీపరాక్రమవిధముఁజూపు
స్నానమొనరించి వచ్చునందాక నిచట.

విఘ్నే—తల్లీ ! త్వదీయాజ్ఞానుసారముగా నటులే ద్వారముంగాచెదను. ఫాలాక్షుఁడు వచ్చినను, లోనికి పదము వెట్టనీయను. ఇఁక నీవు పోయి స్నానాదికృత్యములనుఁ దీర్చుకొనవచ్చును.

(పార్వతి నిష్క్రమించును.)

(అటునిటుఁదిరుగుచు,) వల్లభునాజ్ఞ శిరసా వహించినదియే భార్య. రాజాజ్ఞమన్నించినవాఁడే భటుఁడు. మేలును మఱువని వాఁడే మిత్రుఁడు. జననీజనకుల యాజ్ఞానుసారముగ వర్తించు

వాఁడే సుపుత్రుఁడు. కావున, నే నిప్పుడు మాతృవాక్యపరిపాలన మొనరించుటకై జాగరూకలతో నుండెదగాక !

ఈశ్వ—[ప్రవేశించి] నేఁటిదినంబున, నే వచ్చుటి చాలనాలస్యమైనది. మత్ప్రియురాలు నారాకకై నిరీక్షించుచుండును. త్వరగా నరిగి చూడవలయు. (ముందునకడుగిడి బాలునిఁగాంచి) ఆహా ! ఈ బాలకుఁ డెవ్వఁడై యుండనోపు ? ఆశ్చర్యముగనున్నదే ! సమీపించి చూచిన స్పష్టముగఁ దెలియఁగలదు.

విఘ్న—అదిగో ! ఎవ్వఁడో సన్యాసి యిట్లువచ్చుచున్నాఁడు ! ఎక్కడికై యుండునో ? ఎక్కడికైననేమి ? (ఈశ్వరునివంకఁ జూచి) ఈ దెసకే వచ్చుచున్నాఁడు ! భిక్షార్థియై యుండనోపు ! ఎందులకైననేమి ? నేనుమాత్రము జాగరూకుండనై యుండెదఁగాక !

ఈశ్వ—(ద్వారమును సమీపించి లోనికరుగనుద్యమించును.)

విఘ్న—(అడ్డుకొని) అయ్యా ! లోపలకుఁ బోవలదు.

ఈశ్వ—ఏల ?

విఘ్న—నీ కెందుల కీగోల ? పొమ్ము. నేఁడు భిక్షఁ బెట్టుటకు వీలులేదు.

ఈశ్వ—నే నెవ్వఁడనని భావించుచున్నావు? ఈగృహాధిపతిని. నిష్కారణముగ శిక్షింపఁబడక లోనికిఁ బోనిమ్ము.

విఘ్న—ఏమి ? నీవు భిక్షకుఁడవుగావా ? అటులైన—

గీ. శిక్షఁ జేసెద నిన్నంచుఁ జెప్పనేల ?
చేతనైనంతపని వేగఁ జేయుమయ్య !
వ్యర్థవాక్కులు విని నేను వడవడవడ
వడకుభీరుఁడననుకొంటివా ? బికారి !

ఓహో ! పెనుభూతమువలె డంబములు పలుకునంతమాత్రమున భయపడెదననుకొంటివా ? చాలుచాలు. పరాభవమునందక తిన్నగాఁబొమ్ము.

ఈశ్వ—(తనలో) ఈబాలకుని రూపరేఖావిలాసంబులంజూడ మిగుల జాలి జనించుచున్నది. మాటలుజూడ విపరీతముగ నున్నవి. నా

రలక్షణమో- చిన్నతనమో తెలియకున్నది. (ప్రకాశముగా) బాలకా! నన్నాటంకపరుపక, నామాటవిని లోనికిఁ బోనిమ్ము.

విఘ్నే—అయ్యా! పోఁగూడదని యెంతచెప్పినను వినకుంటివి. నీకు పైత్యమా యేమి? నీకుదోఁడు, ఒకరుచెప్పిన వినవు! నే నేమి చేయఁగలను?

ఈశ్వ—అయ్యో! పెద్దవాఁడను చెప్పుచుంటినని యైనను, నీబుద్ధిని మరలించుకొని కొంచెమైనను యోచింపవేమి? తాను మ్రింగునది యు, తన్ను మ్రింగునదియుఁ గూడ గుర్తింపవేమి? నా కాగ్రహము గల్గిన వధించెదనుసుమా!

విఘ్నే—ఓహో! శృతిమించి రాగమునఁ బడినట్లున్నదే! భళిరే! సన్యాసీ! నీవు గుడిని, గుడిలోని లింగమునుఁ గూడ మ్రింగునట్లు కనఁబడుచున్నావే? ఎంతలకు నీ కీవితండవాదము! నీకు శక్తి గలదేని నాతోఁబోరుము! లేకున్న సన్నసన్నగ నావల జారుము.

ఈశ్వ—అయ్యో! బాలకా!

గీ. ఎన్నివిధములఁ జెప్పిన చిన్నతనమె
చూపుచున్నావు శాంతముఁ జూపవైతి
వేమిచేయుదు నింక నిన్నెటుక్షమింతు?
చేతులాడవు నినుఁజంప చిఱుతవాఁడ!

విఘ్నే—గీ. లోపలకుఁ బోవవలదని కోపముసను
శాంతమునఁ జెప్పుచున్న రవ్వంతవినవు;
శూరధర్మముఁ జూపుచుఁ బోరుసలుపు,
మోసమని యెంచితివె-వెఱ్ఱిముసలివాఁడ!

ఎన్నిచెప్పినను వినక నీవు తాపట్టినకుందేటికి మూఁడేకాళ్ళనినట్లు వచించుచున్నావు. ఈఁడుఁజూడ వృద్ధుండవువలెను, రోసముంజూడ రుద్రుఁడవువలెను, వేసముంజూడ యోగివివలెను, మీసము జానెడు, గడ్డము

మూరెడు, ఒడ్డు-పొడుగుగలిగి, గడ్డిబొమ్మవలె నున్నావు. ఆహా! ఇఁకనైనను, నీపరాక్రమముఁ జాలించి, పరాభవమునుఁ జెందక, బిరబిరఁ జారిపొమ్ము.

ఈశ్వ—ఓరీ ! కుఱ్ఱా !—

ఉ. బాలుఁడవంచు, నీకు మృదుభాషలచేత హితంబుఁ జెప్పినన్,
మేలెఱుగంగలేక, కడుమేటిబలాఢ్యుని రీతిబల్కెదా
చాలును; నీపరాక్రమము! చావఁదలంచితివేని రమ్మిదే
శూలముఁబూని నిన్నిపుడె ప్రుక్కఁగఁజేసెద నోరిడింభకా!

పిల్లవాఁడవని మెల్లమెల్లనఁ జెప్పుచున్నకొలందియుఁ గన్నులుగానక, త్రుళ్ళిపడియెదవేమి? ఇఁక నోడలెఱుఁగని ప్రల్లదంబులు బల్కెదవేని చల్లచల్లగా యమపురికంపెద! జాగ్రత్త! (ఇంచుక శాంతించి తనలో) అయ్యో! బాలకుని వాక్యములకు నే నింతగా దురాగ్రహము నందుచుంటినే! ఛీ! మంచిమాటలచే, నెట్టులైనను, బోధించి లోపలకుఁ బోవెదఁగాక! (ప్రకాశముగా) కుమారా! చిన్నతనంబున నిట్లనుచున్నాఁడవేకాని, నేను లోనికిఁ బోయినంతమాత్రమున, నీకుఁ గలిగెడినష్టమేమి? బాలుఁడవనియు, మోహనాకారుఁడవనియు జాలినంది, యింతవఱకు శాంతము వహించి, యనేకవిధంబుల బోధించితిని. ఇఁక నా కాగ్రహమును గల్గింపక నీబుద్ధి మరల్చుకొని నన్ను విడిచిపెట్టుము.

విఘ్న—(స్వగతము) మజ్జనని యాజ్ఞానుసారముగా శూలధరుండనై ద్వారమును గాచియున్నవాఁడనుగదా! ఇప్పట్టున నీముసలిసన్న్యాసిని కనికరించి విడిచిన పౌరుషలోపమేకాక, మాతృశాసనోల్లంఘన మొనరించినవాఁడ నగుదును. కావున వీనిని ప్రాణములున్నంతవఱకును విడువను.

ఈశ్వ—బాలకా! ఊరకుంటివేల?

(అనుబంధము 2.)

విఘ్నే—ఊరకుంటివనియా ప్రశ్నించుచున్నావు? నీవంటి ముసలిన క్కలతోడను, పిఱికిపందలతోడను వాగ్వివాదము సేయుచున్నందులకు సిగ్గుపడి యూరకుంటిని.

ఈశ్వ—(కోపముతో) ఓరీ! ఇది హాస్యమునకు సమయముగాదు. నన్ను లోనికిఁ బోనిచ్చెదవా? లేక నిష్కారణముగఁ బ్రాణ త్యాగమొనరింతువా? యోచించి తుదిమాట వచింపుము.

విఘ్నే—అట్లయిన నీవు చేయఁదగిన మార్గముం జెప్పుచున్నాను వినుము.

గీ. "దైవమా! పసిబాలు నీ దర్పమునకు,
భయముఁగొని వానిబ్రతిమాలఁ వలసివచ్చె
వసుధ నాజన్మమేల కాల్పనె" యటంచు,
గోయిరయో! సూయియో! చూచుకొనుటమేలు.

కాదందువా?

గీ. "ప్రాణములు తప్పక హరింతు నీ బాలకుఁ"డని
పదములకు బుద్ధిజెప్పి-"హా! నీ బ్రతుకుజీవుఁ
డా!" యటంచును పారుటో నీ యధికభక్తి
శరణు నరుఁ జొచ్చుటో వేగ నీ సలుపుమయ్య!

ఈశ్వ—(తనలో) వీఁడు మాటలకు లోఁబడునట్లు కాన్పింపఁడు. మాయావేషధారియగు రక్కసుఁడేమో యని నా కనుమానముగ నున్నది. శాంతము పనికిరాదు. పాకము ముదిరినది. కాఠిన్యము వహింపకతీరదు. త్రోసికొని బలిమిం బోవుటయే కర్తవ్యము.

(బాలునిఁ ద్రోసికొని పోఁబోవును.)

విఘ్నే—(అడ్డుకొని) ఓహో! మెడఁబట్టి గెంటుచున్నను చూరుపట్టుకొని వ్రేలాడువానివలె నున్నావే?

గీ. పెద్దగడ్డంబు, పులితోలు, మొద్దుమొగము,
భూతిరుద్రాక్షలనుదాల్చి భూతమువలెఁ
దోఁచుచున్నావు శూలముతోడనిపుడె
పొడిచెదను కాచుకొనుమెట్లు పోదువింక?

(అని శూలముతోఁ బొడుచును.)

ఈశ్వ—(దేహము తప్పుకొనుచు)

గీ. ద్వారమున కడ్డముగనిల్చి బాలకుండు
శూలమొక్కటి ధరియించి ప్రేలుచుండె;
చూచుటకు చిన్నవాఁడుగా దోఁచి, మేటి
రక్కసునిరీతిఁబొడిచె యుశిరంబుమీఁద.

(స్వగతము) ఇఁక వీనిని కాచినఁ బ్రమాదంబగును. (ప్రకాశము) ఓరీ నీచా! నే పొడిచెడిపోటు కాచుకొనరా! (అని శూలమును ద్రిప్పి బాలుని పొడువఁ బోవును.)

విఘ్నే—(పోటుఁ దప్పించుకొని.) ఓరీ! అధమాధమా! నీపో టేమ
య్యెనురా!

ఉ. ఓరి! మహోగ్రపాతకుఁడ! యోరిదురాత్ముఁడ! బాహువీరదు
ర్వారబలాతిరేకమునఁ బట్టెద లోనికిఁ బోఁదలంచినన్
ఘోరరణంబొనర్చి, నిన్నుఁ గూల్చెద శూలముఁ జేతఁ దాల్చి పో
పోర! బిరాన, నీ విఁకనుఁ బోవకయుండిన గెంటివేసెదన్.

(హుంకరించి శూలముతో నీశ్వరునిఁ బొడుచును.)

ఈ—(ఉగ్రుఁడై) ఓరీ! వేషధారి దానవాధమా!

క. బాలకవేషముఁ దాల్చిన
కాలునివలెఁ బొడిచితీవు; కఠినముగా, నన్
శూలముతో నీకంఠము
నేలం గూలంగ వేతు; నిక్కంబిదిగో!

(అని శూలముతో బాలునొక్క వ్రేటు వేసిన శిరము గూలి మొండెము నేలఁబడును. ఈశ్వరుఁడు నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

రంగము 2.

ప్రదేశము—కైలాసాంతర్భాగము.

[ప్రవేశము—చెఱియొకప్రక్కనుండియు, పార్వతీపరమేశ్వరులు.]

పా.—ప్రాణేశ్వరా! నేఁటిదిన మింతయాలస్యముగా విచ్చేయుటకుఁ గారణమేమి? ఇంతవఱకును, జపము చేయుచుంటిరా? లేక భక్తసంరక్షణార్థ మెందేని యరిగియుంటిరా? (ఆశ్చర్యముతో) నాథా! మఱచితి! సింహద్వారమున బాలకుఁడులేఁడా! తమరెట్లు లోనికి రాఁగల్గితిరి?

ఈశ్వ—(వెలవెలఁ బోయి) బాలుఁడా!—ఆఁ—ఉన్నాఁడు.

పార్వ—ఉండిన మీరెట్లు వానిచే నభ్యంతరపరుపఁబడక లోనికి రాఁగల్గితిరి?

ఈశ్వ—వానిని తప్పించుకొని రాలే ననుకొంటివా యేమి? ఆ బాలకుఁడెవ్వఁడు?

పార్వ—వాఁడు మన కుమారుఁడు.

ఈశ్వ—(ఆత్రముతో) మనకుమారుఁడా? ఎట్టికుమారుఁడు?

పార్వ—

సీ. జపమునకును మీరు చనినతోడనె నేను
మీ యాజ్ఞనించుక మీఱకుండ
వనితలతోఁ గూడి వనవిహారము సల్పి
స్నానమాడెదనన్న సకియలెల్ల

నలుగిడుచుండిన । నలిగిపైబడు పిండి
తాలికలను చిన్ని । బాలకునిఁగఁ
జేసి బ్రహ్మను బిల్చి । జీవంబువోయించి
పుత్రునిఁగానెంచి । బుజ్జగించి
యమర గణనాథుఁ డంచు నా । మమునొసంగి
"స్నానమును జేసి వచ్చునం । దాక, తండ్రి !
ద్వారమును గాచుచును శూల । ధారివగుచు
పురుషులను వీడ" కని జెప్పె । పార్వతినాథ !

పిదప, స్నానాదికృత్యములను నిర్వర్తించుకొని మనకుమారుని చెంతకు నేగుచుండ మీ రెదురైతిరి.

ఈశ్వ—(నిశ్చేష్టుఁడై నిలువఁబడును.)

పార్వ—(ఆత్రముతో) నాథా ! ఊరుకొందురేల ? ఏమైనఁ బ్రమాదము సంభవించెనా యేమి ?

ఈశ్వ—(నిరుత్తరుఁ డగును.)

పార్వ—అబ్బా ! ఇదియేమి ? నాదక్షిణనేత్ర మదరుచున్న దేమి ? నాథా ! నామనంబు తత్తరపడుచున్నది. మీపాదపద్మములకుఁ బ్రణామిల్లెద ! దయచేసి, త్వరగాఁ దెలియఁ జేయుఁడు !

ఈశ్వ—(నిట్టూర్పువిడిచి) చెలీ ! ఆబాలకుని నే నెన్నివిధముల లోనికిఁ బోనిమ్మని బ్రతిమాలినను వినక, తనబలపరాక్రమముచే, జృంభించి కారులుప్రేలి శూలముతో నన్నుఁ బొడిచెను.

పార్వ—(మఱింత యాత్రముతో) పొడిచినపిదప నాబాలకుని మీ రేగే మిచేసితిరి ? త్రోసివేసి లోనికివచ్చితిరా యేమి ?

ఈశ్వ—లేదు; లేదు. నాదేహమును నొప్పించుటచేత, కృత్రిమవేష ధారియగు నొకానొక రాక్షసుఁడేమో యను ననుమానంబున, వధించి వచ్చితిని.

పార్వ—కుమారా! (అని మూర్ఛిల్లి మరలలేచి) కటకటా! నాముద్దులయ్యా! గణనాథా! మోహనాకారా! నాయనా! ప్రమాదవశమున, మీతండ్రిగారే నిన్ను వధించితిరా! బ్రహ్మాదేవుఁడు నీకుఁ బరిపూర్ణప్రాణదాన మొనరించెనని యపరిమితానందభరితురాలనై యుప్పొంగుచుంటిని గదా! అట్టితరి నిట్టియకాలమృత్యువు నీకెట్టుల సంభవించెనురా తనయా! నేనిప్పుడీదుఃఖసాగర మెటులతరింతును; చిన్నికుమారా! నేను స్నానమునకుఁ బోయి, వచ్చెదనని చెప్పి నీచేతి కొక శూలమునిచ్చి, ద్వారదేశమునందుంచి, పరులను వీడవలదని చెప్పినప్పుడు నీవెంతో ధైర్యముతో వచించిన వాక్యములనుఁ దలంచిన గుండెలవియక మానునా? కుమారా! రూపజితమారాకారా!

(అనుబంధము 3.)

ఈశ్వ—తన్వీ! బ్రహ్మాదులందఱు నీయాజ్ఞానువర్తులై యుండ, సామాన్యరాలివలె నీవిటుల వాపోవఁదగునా? ఆబాలకుఁడు, మనకుమారుఁడని తెలిసిన వధింతునా? కావున ముందుచేయవలసినకర్తవ్యము నూహింపవలెను గాని, గతజలసేతుబంధనమువలనఁ బ్రయోజనమేమి?

పార్వ—నాథా! బాలకునివద్దకుఁ బోయి చూచునంతకును, నామనస్సు మిగుల వ్యాకులమునందుచున్నది! త్వరగా నేగి చూతమురండు.

ఈశ్వ—అట్లేకావింతము రమ్ము.

(ఇరువురును, నిష్క్రమింతురు.)

## రంగము—3.

### ప్రదేశము—సింహద్వారము.

[ప్రవేశము—మృతి నందియున్న బాలుఁడును,
పార్వతీ పరమేశ్వరులును.]

పార్వ—హా ! కుమారా ! (శవముపైఁబడి.)

సీ. దానవమథనోక్ష దర్పశాలివి నీకు
మృతియెట్లు ఘటిల్లెనిటుల తండ్రి !
పసుపుతో సృష్టించు భాగ్యమబ్బె నటంచు,
కొండంత ముదమునఁ గూడియుంటి
చిరకాలజీవిగాఁ జేసె, బ్రహ్మయటంచు,
మనమునను పొంగి మసలుచుంటి
నాకారణంబున నధిక ధైర్యంబునఁ
జిన్ని శూలంబు నీ చేతికిచ్చి
ద్వారమునను౦ప, మన శూల ధారివచ్చి,
నిన్నుఁ దెగటార్చె నీతలోఁ గన్నతండ్రి,
యేమిచేయుదు నింక, నే నెటులసైతు,
ప్రేమతోనను జూడవా ! ప్రియకుమార !

గణనాథా ! నిన్ను పట్టభద్రునిగాఁ జేయవలెనని పుట్టెడాశతో, స్నానమునకుఁ బోతిని. అట్టిభాగ్యము నాకుఁగలుగకమున్నే యమపురంబున కరిగితివా ? పట్టీ ! పద్మసంభవుఁడు నీకుఁ బ్రాణముఁబోసి నప్పుడుచిరకాలజీవివాదువని నుడివెనుగాని, యిట్టియకాలమృత్యువు సంభవించునని, వచింపలేదే ? పూర్ణశశాంక సదృశంబగు నీముద్దుమోముంగనులారఁ గాంచఁగలనా? అయ్యో! ఇఁకనాకు ముద్దిడువా రెవ్వరు ? (చెక్కిలి నొక్కఁబోయి శిరము౦గానక) అకటా ! నీశిరంబేలఁ గాన్పింపకున్నది

నిజముగ లేదా. కాక పుత్రశోకసాగరంబున మునింగియున్న నాకన్నుల యందు దుఃఖాశ్రువులు కప్పియుండుటచే నట్లు గాన్పించుచున్నదియా! (పరిశీలించి) అయ్యో! నేను భ్రమపడియుండలేదు. శిరము నిజముగానే లేదు; (ఈశ్వరునితో) నాథా! ఈపసిపాపఁడు మీరు శిరచ్ఛేదముం జేయునంతటి యాగ్రహమునుఁ గలిగించెనా? ఇంతకును శిరంబు గాన్పిం పదే! ఏమైయుండును?

ఈశ్వ—సఖీ! ఈబాలుండు నాదేహము రక్తసిక్తంబగునంతటితీవ్రం బుగఁ బొడిచెను. అంత నేను నామేను నెఱుంగక తీవ్రక్రోధంబు నఁ బొడుచుటచే, శిరంబెందో తూలిపడియుండును.

పార్వ—ఆఁ! ఆఁ!! నాచిన్నికుమారునిశిరం బెగిరిపోయినదా! అబ్బా! దుర్భరము! దుస్సహము!! ఈదుఃఖవారాశిని నే నెట్లుతరింతును!

సీ. శ్రీరాగ వితతిచేఁ జెన్నొందు నిమఁబోలు
పుత్రుండు నా కెట్లు వొడమునయ్య!
మోహనాకార! నీముద్దుమోమునుఁ జూడ
గల భాగ్య మింకెట్లు గలుగునయ్య!
కల్యాణి యనుకొమ్మ కాంతామణిని నీకుఁ
గల్యాణ మొనరింపఁ గాంచనైతి!
సారంగ నిభములౌ సదమలాపాంగంబు
తో నన్నుఁ జూడవా మానసీయ!
తోడిబాలురతో జతఁగూడితిరుగ
నిన్నుఁ గనుగొననైతి నే కన్నులార!
కన్నడల నెట్లుభరింపఁగఁ గలను తనయ!
వేఁగ నాకొక్కముద్దిడవే! గణేశ!

(బ్రహ్మ నుద్దేశించి యాగ్రహముతో) ఓరీ! విధాత!

ఆ. నన్ను మాయఁజేసి నాకుమారునకు దీ
ర్ఘాయువిచ్చినట్టు లభినయించి
యాయు వల్ప మొసఁగినట్టి వాక్పతి! నీకు
శాప మొసగి యిప్పుడే పడంతు.

(యము నుద్దేశించి యాగ్రహముతో) ఓరీ! దండధరా! కండకావరంబున నాకుమారుని సామాన్యునిగాఁ దలంచి, త్వన్నికేతనంబునకుం జేర్చుకొంటివా! కానిమ్ము. ఇంక నీయంతముం జూచెదంగాక!

[బ్రహ్మయు, యముఁడును పటాక్షేమునఁ బ్రవేశింతురు.]

బ్రహ్మ—తల్లీ! భక్తజనకల్పవల్లీ! యుష్మత్క్రోధానలజ్వాలలం జల్లార్పుము! శమనసహితుండనై చతురాననుండనగు నేనే యిందు వచ్చితిని. ఇంక నీతనూజుని పునర్జీవితునిగా నొనరించి పరిపూర్ణాయుర్దాయంబు నొసంగెదము. మాశక్త్యనుసారముగా నొక్కొక్క వరంబునుఁ బ్రసాదించెదము. మా యపరాధంబులను మన్నింపుము.

పార్వ—(కోపముతో వారిం దేరిచూచును.)

బ్రహ్మ—(చేతులు జోడించి) తల్లీ! రక్షింపుము. నీకుమారుని సజీవునిగా నొనరించుటకు వానిశిరంబు గావలయును. వెరికింపుము.

పార్వ—పితామహా! అరసితిమిగాని మాదురదృష్టవశంబున దృగ్గోచరము కాదయ్యెను. ఎందో తూలిపడియుండును.

బ్రహ్మ—అటులైన నేదేని యన్యప్రాణిశిరంబైనఁ గావలయు. సమర్థులగుభటుల నీనిశీథముననే పంపి, యుత్తరముఖంబుగా శిరంబునిడి నిద్రించు నేప్రాణిమస్తకమునైనను ఖండించి సత్వరమే కొని రమ్మని యాజ్ఞాపింపుము.

పార్వ—మంచిది. లోనికిఁబోయి యాఁమలకుఁ దగుప్రయత్నముల నొనరింతము. రండు.

(అనుబంధము 4.)

(అందఱును నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

## రంగము 4.

ప్రదేశము—రాజవీధి.

[ప్రవేశము:- శూరుఁడు, వీరుఁడు అనుభటులు.]

(అనుబంధము 5.)

వీరు—ఓరీ! శూరా!

శూరు—ఏమిరా! వీరా!

వీరు—పట్నంలో నల్దిక్కులా సూశాంగాని యెక్కడా వారు సెప్పినట్టుగా పడుకున్నోళ్లు కానొచ్చారుగారు. ఇఁక మనం యేమి సేయాలిరా?

శూరు—ఓరేయ్! ఉత్తరంకేసి బుర్రెట్టి తొంగుంటే తప్పుగాదంట్రా!

వీరు—అందుకుసేతే, ఎవ్వఁడూ తొంగున్నాడుగాఁడు. ఐతేసి, అచలు ఉత్తరంకేచి తొంగుంటే, యేంతప్పో నీకు తెల్సునా?

శూరు—మరేమీ గాదురా! ఉత్తరంకేచి తొంగున్నోడు, నిద్ర లెగంగానే దచ్చినంకేచి చూచితీరాల్సిందే. ఆదచ్చినపుదిక్కున యమదరమరాజుంటాడు గనక, ఆయేపు పొద్దున్నే సూసేవోళ్ళని యమదరమరాజు తనసాఁన్నానికి రమ్మంటాఁడట. ఇదే తప్పు. అందుకనే యెవ్వళ్లూ వుత్తరదిక్కున శిరుసెట్టి తొంగోనేరు. ఆలాగ పడుకున్నోళ్ళకి నరకమని పెద్దలంటారందుకనే.

వీరు—ఎవడుమాత్తరం కూడనిపనెందుకు సేత్తాఁవురా శూరా! నరకమంటే అందరికీ బయ్యమే.

శూరు—ఆలాగ పడుకున్న నరమాఁసవుడు దొరకడం సాలాకట్టమైన చంగతే. మనపని సీకటిసాటున కావల్సిందేకాని, పొద్దొడిచాక, అందరికంటా పడతాం. మనమొచ్చిన పనీ కాదు. ఇది గొప్ప మారాజుల చాచనం. సేయలేక వొట్టిసేతు లాడించుకుంటా యెల్లితే, తిట్లూ, దెబ్బలూ తప్పవు. అందుకని నాకొకాలోశన తోసింది. నువ్వేమంటావో మరి?

వీరు—ఏమాలోసించావో సెపుదూ.

శూరు—ఏమీలేదు; సేనాసులువే. మనిద్దర్లో వొహడుబుర్ర నింకోడు నరుక్కెల్లి సూపితే మాటదక్కుతుంది. నేకుంటే మనకు సావొత్తుంది. అందుసేతే, చాత్తరాలెరిగిన పెద్దోళ్ళు పానం పోగొట్టుకోనైనా చరే, మానం నిలబెట్టుకోవాల్సిందని సెప్పారు! అల్లాగ సేతామంట్రా మరి?

వీరు—మంచిమాటే సెప్పావులే. ఇంతకంటే నాకింకొకాలోచన మంచిది తోసింది. ఏంటంటే, ఆరు మనకి సెప్పటంలో, బుర్రంటే బుర్రన్నారు కాని మనిసిది-పసువుది అని యివరంగా సెప్పనేదు గందా! అందుసేత మనిసిబుర్ర దొరకలేదు గనక, అడివికెల్లి, యేదైన జంతువుశిరస్సు కోసుకెళ్ళి సూపితే మాటదక్కుతుంది. ఏమంటావు?

శూరు—ఇంకా అనేదేంటి? నీమొగం - నామొగం - బలే! నీకు మాదొడ్డమాట తోసిందే! అడివికెల్దాం పద.

(ఇరువురును నిష్క్రమింతురు.)

---

## రంగము 5.

ప్రదేశము—అరణ్యము.

[ప్రవేశము:—వీరుఁడు, శూరుఁడు.]

వీరు—మనం, యీకానలో గూడా శానామట్టుకు యెతికాంగాని యెక్కడా వుత్తరదిక్కుకేసి శిరుసించి తొంగున్న జాతువైనా కండ్లబడ్డాదిగాదురా!

శూరు—ఈరా! యింకా యెతుకుదాం. పదస్నే! (కొంతతడవు వెదకి) అదుగోగోయి! జంతువునాగుంది! ఉత్తరశిరుస్సుగానే తొంగుంది. (ముందుకుఁజని) ఏనుగురా! మనపున్నెం పుచ్చింది! పారోతమ్మగారి ఆగ్గెపెకారం యేనుగతలకాయ కొట్టేసి, తీసికెళ్ళి, ఆరికిచ్చేదాం. తొరగారాకు. ఏదిరాకత్తి?

వీరు—పండుకున్న జీవాన్ని సంపడం పాపం గాదంటరా! శూరా!

శూరు—పెబువులఆగ్గె తప్పితే, అంతకంటె పాపంరా నాయనా! ఈ యేనుగతలకాయకి గొప్పగొప్ప పూజులు జరుగుతాయిరా! ఆబాగ్గెం దానికి పట్టబట్టే మనకంటబడ్డది. నరుకు—నరుకు—ఆపాపపున్నేలు మనపెబువులవే కాని మనవిగావు. ఎవళ్లెనసత్తేనేమి, తనకొడుకు బతికితే సాలునని ఆయమ్మకోరిక! ఏనుగని నరకటానికి మనము యెనకాడినా, మనల్నిద్దర్ని నరకటానికి ఆయమ్మ యెనకాడదు. ఈనడమంతరపుసావు మన కెందుకు? సంపు—సంపు—బేగి.

వీరు—(భయముతో ఏన్గశిరస్సును తెగవేయును.)

తెరవ్రాలును.

---

## రంగము 6.

### ప్రదేశము—కైలాసము.

[పునఃప్రవేశము-వీరుఁడు శూరుఁడు గజమస్తకసహితులై.]

వీ—శూరా! ఈతలకాయ సూశావంటరా ?

శూ—ఏమిరా! యీరా!

వీ—వో త్రిగిలితొంగున్నదాని వోరొంపున కంగారుగా నరకడంసేత వొంకపోర తెగిపోయిందిరా!

శూ—అవతల పెబువుల అవసరానికీ మనతొందరికీ సరిపోయిందిలే! ఆలాగంటప్పుడు అన్నిసరిగ్గా కుదరమంటే కుదురుతాయంటరా! సరేగాని, యీతలకాయకోసరం ఆరు కనిపెట్టుకోనుంటారుగాని తొరగా తీసికెళ్ళి పారోతమ్మగారి కిచ్చేసెయ్యి. ఏదైనా బహుమానంగానీ యిత్తేవట్టుకొనిరా! నీకోచం కనిపెట్టుకొని యిక్కడేవుంటాను. తొరగావెళ్లు.

వీ—(ఏనుఁగుతలతో నిష్క్రమించును.)

శూ—(స్వగతం) ఆరుయినాయిత్తారని ఆచపెడితేనేగాని, యీమెదవ కదలిపోడు. ఒకేల, యిద్దరంకలచిపోతే-మనిచితల తెమ్మంటే యేనుగతలెందుకుదెచ్చారని కోపగిత్తే తంటావొత్తాది. అందుచేత కొంచెం యెనకాత్తిగావుంటేనే యెందుకైనామంచిది. ఆరికి దయొత్తే, యేదైనాదయసెయ్యనెసేత్తారు? అప్పుడు ఆవోటా నాకు రానేవొత్తుంది?

[వీరుఁడు పునః ప్రవేశము.]

శూ—ఏంజరిగిందిరా! యీరా!

వీ—నేను యేనుఁగుబుర్రొట్టుకెళ్లేసరికీ—మనమేం తెత్తామో అని ఆరు ఎదురుసూత్తావున్నారు. నేను బుర్రొట్టుకెల్లి పారోతమ్మగోరికిచ్చే

శాను. ఆయమ్మ మాటమాటాడకండా దాన్ని బెమ్మదేవుడికి చ్చింది. అప్పుడు బెమ్మదేవుడుగారు బుర్రని మొండేనికితగిలించి మంత్రాలుసదివి నీళ్లుసిలకరించేవరకీ అబ్బాయిగారు, నిద్దరలేసి నోడికిమల్లే, లేసి కూకున్నాడురా!—నేను యీనాం అడుగుదా మన కున్నాను గాని ఆసంతోషంలో ఆమాండటంనేత నాకుచమ యందొరికిందిగాదు. ఐతేనేంగాని, శూరా ! ఏనుగుబుర్రతగిలిం చాక అబ్బాయిగారు మాసిత్తరంగా తయారైనాడురా ?

శూ.—అల్లాగంట్రా ! ఐతే ఆయబ్బాయిగారి రూపరేకా యిలాసాలు సూడాలని చాలాచరదాగావుంది. చూద్దాంపదరా !

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

ప్రథమాంకము-సంపూర్ణం.



# శ్రీకృష్ణప్రతిజ్ఞ

## ద్వితీయాంకము.

రంగము 1.

ప్రదేశము—కైలాసమందిరము.

[ప్రవేశము—సుఖాసీనులైన పార్వతీపరమేశ్వరులును వినాయకుఁడును.]

పా—(కుమారునిదగ్గఱకుఁ దీసికొని) నాయనా! గజాననా! ఈమహాత్ముఁడు నీతండ్రిగారు, నీకు సదా పూజనీయులు. ఆసంగతి నీ వెఱుంగకపోవుటవలన నింతమోసము సంభవించినది.

వి—తండ్రీ! నమస్కారము? ఎఱుఁగక నే నొనరించినయపరాధమును మన్నింపవేఁడుచున్నాను.

ఈ—తనయా! చిన్నతనముచే తెలియకచేసిన తప్పిదము తప్పిదము కాజాలదు; కావున క్షమాపణ మనవసరము?

పా—జీవితేశా! మీకటాక్షముచేత బ్రహ్మయు, విష్ణువును, నరుదెంచి, మనగజాననుని సజీవుని గావించి, తగినవరములనుఁ బ్రసాదించిరిగదా! తాముసయితమొకవర మనుగ్రహింపరాదా?

ఈ—దేవీ!—

క. వరములిఁకేటికి? మనపుర
వరమునకే నాయకుండు; వనితా! మనకుం

గర మొప్పఁ బెద్దకొండు కగుఁ
గరిముఖుఁ డని, లోకులంద్రు; కడుముదమారఁగ.

మఱియును,

గీ. భాద్రపదశుద్ధచవితిని ప్రతికె విఘ్న
నాయకుండందుచేతను నరులు భువిని,
పూజలానాడుగావింపఁ బుత్రపౌత్ర
వృద్ధిఁ గాంచుచునుందురు వివిధగతుల.

పా—నాథా! మొదటనే యడుగఁ దలంచితినిగాని, పుత్రునిమృతివార్త నాలకించినంతనే మానసము స్వవశత నుండకపోవుటచే నడుగఁ జాలకపోయితిని.

ఈ—దేవీ! ఆవిషయమేమి?

పా—మరేమియును లేదు; మీభక్తాగ్రేసరులెల్లఱును క్షేమముగ నున్నవారుగదా!

ఈ—సఖి! మన్నామస్మరణము నొనరించు నిజభక్తాగ్రేసరులకెన్నడును శ్రేయములకుఁ గొరంతయుండదు గదా!

పా—దేవా! అట్లయిన దేవరవారి నామంబును నిరంతరము స్మరించు నిజభక్తశ్రేణికిం గూడ దరిద్రంబులు రాగతంబేమి?

ఈ—దేవీ! అది పూర్వజన్మసంస్కారఫలము. ఎట్టిభక్తులకైనను ప్రారబ్ధకర్మ ముత్తరజన్మమునం దవశ్య మనుభవంబునకు వచ్చును.

పా—అట్టి పూర్వజన్మకృత కిల్బిషములేనివారిమాటయేమి?

ఈ—అట్టి దుష్టప్రారబ్ధరహితులు, దివ్యలోకములయందు చిదానందానుభవముం గాంచుచుందురే కాని పునర్జన్మము నొందరు. అందుల కొక తార్కాణముం జూపెదను వినుము.

చ. శిశువుజనించువేళ, తనుఁ జేసిన పూర్వఫలంబుఁ బొందు, నా
వశమె యటంచు నే, ద్వి శతవారలు సంతసమందుచుందురా

శిశువుపురాకృతంపు తుదిఁ జేరి, సుఖంబుగఁ బోవు వేళ, త
ద్దశనుఁ దలంచియేడ్చెదరు, దారయుఁ బుత్రులుబాధుజాలముల్.

[తరువాత భృంగిప్రవేశము.]

భృం—(స్వగతము)

(అనుబంధము 6.)

ఆహా! ఎంత యుబ్బురముగానున్నది. గొప్పవారిచర్య లీలాగుననే కదా యుండును. పార్వతీపరమేశ్వరుల కేకొంతగలదని, దేవతలనంత గా వరంబులిమ్మని ప్రార్థించిరి. అందుల కీదేవతలు తమకొంపలు మునిగి నట్లు, తమతమయధాశక్తిని వరంబులనిచ్చిరి. నే నీశ్వరసన్నిధానమున చిర కాలమునుండియు, నెంతోభక్తితో పరిచర్యలుసేయుచు, కనిపెట్టుకొని, దాసానుదాసుఁడనై యుంటినిగదా! నాకొక్కవరము ప్రసాదింపుమ ని చెప్పరై రిగదా! గొప్పవారును గొప్పవారికే దోఁచిపెట్టుదురు; కొద్ది వారును గొప్పవారికే దోఁచిపెట్టుదురు. ఇది ప్రకృతిసహజమైపోయినది. అందుచేత దేవతలందఱును గణనాథునకు గొప్పగొప్పవరంబులను ప్రసా దించుటంజూచి, నేను, నాశక్తికిఁ దగినట్లొక యెలుకను సంపాదించి, వినాయకుని గుజ్జుదేహమునకది తగియుండునని బహుమానమొసంగఁగో ని తెచ్చితిని. ఈమూషికము నావేల్పునకు సమర్పించి, వాహనంబునుగా స్వీకరింప బ్రతిమాలెదఁ గాక! అటుపైని వారియభిప్రాయ మెట్లుండునో యట్లుగావింతురు?

(సమీపించును.)

వి—జనకా! తమ ముఖ్యభక్తుండగు భృంగీశ్వరుఁ డిట్లువచ్చుచున్నాడు.

ఈ—మంచిది, రానిమ్ము.

భృం—(సమీపించి నమస్కరించి) జగత్ప్రభులగు పార్వతీపరమేశ్వరుల కు వందనశతంబులు.

ఈశ్వ & పార్వ—సంకల్పసిద్ధిరస్తు.

భృం—గజాననా! నమస్కారము?

వి—సుఖీభవ?

భృం—స్వామీ! గజవదనా!

సీ. అబ్జాసనుండిచ్చె నాయుఃప్రపూర్ణత
వాసుదేవుండిచ్చెఁ బ్రథమపూజ
మానసరస్వతులు సంపద్విద్యలొసఁగిరి
బహుబలంబిచ్చెఁ బ్రభంజనుండు
యముఁడు వరంబిచ్చె యమబాధ లేకుండ,
శూలంబొసంగెను మూలరేడు
సరసిజాప్తుండిచ్చె సమధిక తేజంబు,
చంద్రాంకమును మాళిచంద్రుఁ డిచ్చె
కొదువదేవతలెల్లఁ గూర్మితోడ,
వారివారికిఁ దగినట్టి వరములిచ్చి
రేను దెచ్చితి నీచిన్ని యెలుకపిల్ల
వాహనమ్ముగ గైకొనవలయుదేవ?
(మూషికమును సమర్పించును.)

వి—(స్వీకరించి) భృంగీశ్వరా!

ఆ. భక్తితోడ నొక్క పత్రి యొసంగిన
ఘనముగాగ దానిఁ గొనెదువాఁడ!
నీయభీష్టములను నెఱవేర్చుటకు వాహ
నంబుగా గ్రహింతు, నతగుణాఢ్య?

భృం—(స్వగతము) ఆహా! ఈయన యీమూషికమును వాహనముగా స్వీకరించునని నేఁ గలనైనఁ దలఁచియుండలేదు; ఇతఁడు దీని నానందముతో నందుకొనియెను. దీనింబట్టి చూడ, గజాననుఁడు భక్తాభీష్టప్రదుండని తెల్లమగుచున్నయది. దాసావనమహాత్మ్

ర్యంబున సతించు తండ్రి కెంమునుఁ దీసిపోవఁడు. (ప్రకాశముగా) దేవా! నాసత్కారంబు మిగుల నల్పమైనదే యైనను, స్వీకరించి నామానసమున కానందముం గూర్చితివి. ఇందులకు నాకృతజ్ఞతా పూర్వకవందనంబుల నర్పించుచున్నాను. ఇక నాకు సెలవు దయ చేయుఁడు.

వి—భృంగీ! మంచిది?

(భృంగి నిష్క్రమించును.)

[తరువాత రామావధాని, కామశాస్త్రి, ప్రవేశింతురు.]

కా—పార్వతీపరమేశ్వరులారా! మీగజాననుని మాశక్తికొలఁది పూజించి సకలశుభంబులం బడయనుంటిమి. కావున మీదాసులమగు మాకోరికల నెఱవేర్చి మీనందనుని మావెంటనంపఁ బ్రార్థింతుము.

(అనుబంధము 7.)

ఈశ్వ—విప్రోత్తమా! మంచిది. అటులనే పంపెదను. ఈతనికై ఎందఱో భక్తులు వేచియున్నారు; త్వరగా మరల మాకడ కంపుఁడు.

కామ—భాగ్యము—

(గజాననుఁడు రామావధాని కామశాస్త్రులతో నిష్క్రమించును.)

తెర వ్రాలును.

---

రంగము—2.

ప్రదేశము—మార్గము.

[ప్రవేశము:-రామావధాని, కామశాస్త్రి విఘ్నేశ్వరుఁడు.]

విఘ్నే—భక్తవరులారా! మీభక్తికి సంతసించితిని. నిరంతరము, మీరలు సిరిసంపదలతోఁ దులదూఁగుచుండురుగాక! కామశాస్త్రిగారూ! ఇఁక నేఁ బోయెదను. నానిమిత్త మెందఱో భక్తులు వేఁచియుందురు. మీరలింద యుండుఁడు!

కామ—స్వామీ! మిమ్ము మీజననీజనకుల కప్పగించి యరిగెదము. అంతదనుక మిమ్ము విడిచిపోవఁజాలము. (అనుసరించి నడతురు.)

(చంద్రోదయమగును.)

విఘ్న—కామశాస్త్రిగారూ! అంబరమునఁ దిలకింపుఁడు!

గీ. అబ్జబాంధవుఁడస్త్రాద్రికరుగఁజూచి
యామినీసతి నిజశీర్షమందుఁ దాల్చు
నట్టి నెలవంక యోయన, నంబరమున
గోడమిన సుధాంశుఁ గంటివే పుణ్యపురుష!

చంద్రుఁడు—(విఘ్నేశ్వరునిఁ గాంచి నవ్వుచు.) ఆహాహా! ఏమి యీ బాలకునిఖర్వాకృతి! ఈగుజ్జురూపమునకును, మహోదరము నకు నన్యోన్యమైత్రము గాన్పించుచున్నదే! అద్భుతము!

ఆ. వీనియుదరమరయ విపరీతముగ నుండె
లావుతిండి వలన లాభమిదియె;
కొన్ని మోదకములు గొనివచ్చుచుండె, పే
రాస దీరకయె ప్రయాసపడుచు.

ఆ. ఇట్టితిండిపోతు నిదివఱ కెన్నఁడుఁ
జూచియుండ మిగులఁ జోద్యమయ్యె
దారినడువలేక, తడఁబడుచున్నాఁడు;
నవ్వఁజేయు నితని, నడకతీరు.

(చంద్రుని దృష్టిదోషముతగిలి విఘ్నేశ్వరుఁడు మూర్ఛిల్లును.)

కామ—అయ్యో! అయ్యో! అవధానీ! మనకేమిప్రమాదము వచ్చు నోకదా? ఈవిఘ్నేశ్వరదేవుఁ డెందువలననో మూర్ఛాగతుండ య్యెను! తల్లిదండ్రుల కప్పగింపకమున్నే యీవిపరీతప్రమాద మువచ్చినదే! హేతువు తెలియకున్నదిగదా!

అవ—బావా! కామశాస్త్రీ! నీవు త్వరగా నరిగి పార్వతీదేవిగారి కీ వార్తను దెలియఁజేసి, యామెను వేగముగ నిందు గొనిరమ్ము. అంతవఱకును నే నీతని కుపచారములన్ను సల్పుచుండెదను. ఇంతకును మనము మిక్కిలి దురదృష్టవంతులము.

(కామశాస్త్రీ నిష్క్రమించును.)

చంద్రు—(స్వగతము) ఓహో! మితిమీరి భుజించినందులకు ఫలము వెంటనే చూపినది. ఇంత కక్కుఱితిగా నేలభుజింపవలయును! ఉండ్రాళ్లపై నపేక్షచేతనా? భక్తులపై నపేక్షచేతనా! (నవ్వును)

అవ—(పైకిఁజూచి) ఓహో! ఆకాశమున చంద్రమండలమునుండి నవ్వు వినంబడుచున్నది. ఒకవేళ యీచంద్రుఁడే విఘ్నేశ్వరుం జూచి నవ్వినకతంబున దృష్టిదోషప్రసారంబున నీతఁడు మూర్ఛిల్లె నేమో!

చంద్రు—(తెరవంక జూచి భయముతో) అక్కటా! అదిగో పార్వతీదేవి కన్నులనుండి క్రోధవిస్ఫులింగంబులను వెదఁజల్లుచు నా వంకకే వచ్చుచున్నది. అయ్యో! వెకలితనంబున నవ్వితిని. నా దృష్టిదోషంబుననే యితండు మూర్ఛనందెను. ఈదేవివలన నా కెట్టికీడమూడునోగదా?

[ప్రవేశము:—కామశాస్త్రీ, పార్వతీదేవి.]

పార్వ—కామశాస్త్రీ! గజాననుఁ డేఁడీ?

కామ—(భయముతో) తల్లీ! అదిగో! మూర్ఛఁజెందియున్నవాఁడు.

పార్వ—(సమీపించి) హా! నాముద్దులపట్టీ! నీవు పుట్టిననాఁటినుండియు నిట్టికష్టములనే పొందుచుంటివి! అకటా! నేనెట్టులు భరింతును! తండ్రీ! ఉదరము శతధావిచ్ఛిన్నమై, కటికనేలను బడియుంటివా? (శాస్త్రీతో) అయ్యా! నాకుమారుఁ డిట్లు పడియుండుట కేమి కారణము?

కామ—తల్లీ! నేఁటి భాద్రపద శుద్ధ చవితిని, పూజించుటకు మీగజాననుని మాగృహంబునకుం గొనిపోయి, మా శక్త్యనుసారం బుగ నర్పించిన భక్ష్యంబుల నారగించిన పిదప, మీసమక్షంబునకు దోడ్కొని వచ్చుచుంటిని. మార్గమధ్యంబున నేలనో మూర్ఛిల్లెను.

అవ—అమ్మా! విఘ్నేశ్వరుని మూర్ఛకుఁ గారణము నే నిట్లూహించితిని.

గీ. చంద్రుఁ డీతని దృష్టించి సరభసమున
తగనిభోజన మని నవ్వె తత్క్షణంబె
పొట్టవిచ్చి ధరంబడి మూర్ఛనంబె
రాజదృష్టి ప్రసార మీ రహిఁవహించె.

పార్వ—ఏమీ! చంద్రుఁడా నాకుమారు నంత నిస్సారముగఁ జూచెను! కానిమ్ము. ఓరీ! చంద్రా! గురుద్రోహీ! దురాత్మా! ఎంతపని చేసితివిరా!

గీ. ఓరి దుర్మార్గుఁడా! నాకుమారు నిటుల
దృష్టిఁగొట్టితి వపకృతి యేమిచేసె?
చవితినాఁడు నిన్గాంచినజనములెల్ల
నిందఁబొందెద రింక నిస్సందియముగ.

చంద్రు—తల్లీ! నిరపరాధినైన నన్ను శపించుట ధర్మముగాదు. లోకవిరుద్ధభోజనం బొనరించి, నీకుమారుఁడే లోకపరిహాసంబునకుఁ బాత్రుఁడయ్యెను. ఇందులకు నన్నేల శపియింపవలయును? నన్ను క్షమించి, నీశాపం బుపసంహరించుకొనుము.

పార్వ—ఏమీ! క్షమింపవలయునా? నాకుమారుని లోకులందఱును బూజించుచుండ నీ వొక్కఁడవే కుటిలబుద్ధిం దిరస్కరించితివి!

ఇంతకన్న నపరాధం జేసికావలయును ? నావాక్కు లమోఘం బులు ! కాన నోరుమూసికొని కదలుము. నోరు మూయుము.

చంద్రు—(నోరుమూసికొని యూరకుండును.)

కామ—(చేతులుజోడించి)

(అనుబంధము 7.)

గీ. తల్లి ! నీవిటు శపియింపఁ దగునటమ్మ !
వసుధఁ జంద్రునిఁ జూడనివారుగలరె ?
స్వల్పదోషంబునకు ఘోరశాపమేల ?
పిచ్చుకపైన బ్రహ్మాస్త్రంబువిడుతురమ్మ ?

కావున, ననుగ్రహించి, క్షమించి నీశాపము నుపసంహరింపవేడెదను.

పార్వ—(యోచించి) సరే ! మీప్రియవచనంబులచే, నాహృదయంబు ప్రముదితంబయ్యెను. ఐనను, నావాక్యంబుల కన్యథాత్వంబు జరుగరాదు. కాన సంవత్సరంబున కొక్కసారి భాద్రపదశుద్ధ చతుర్థినాఁడు చంద్రునిఁగాంచినవారల కపనిందలుతప్పవు. ఐనను మతొక్కమారు నాదివసంబున శాస్త్రోక్తంబుగఁ బూజించి తత్ప్రా జాక్షతలను శిరంబున ధరించినవారి కపనిందలు తప్పిపోవునట్లు వరంబు ననుగ్రహించితిని. ఇఁక మీరరుగుఁడు. అయ్యో ! విప్రో త్తమా ! మోదకభారంబున నాపుత్రుని యుదరంబు విచ్ఛిన్నం బయ్యెను. సర్పంబులచే నుదరంబును బంధింపవలయును. మనమే తత్ప్రయత్నంబు గావింతము రండు.

కామ—చిత్తము.

(అందఱును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

## రంగము—3.

[ప్రవేశము—సత్రాజిత్తు, ప్రసేనజిత్తు.]

సత్రా—

ఉ. తమ్ముఁడ ! చెంచునాయకుల కీదారుణబాధలు వింటివేకదా !
లెమ్ము ! భటాళిఁబిల్చి, యవలీలగఁ బట్టెడు వేటకుక్కలం
దెమ్మని యానతిచ్చి, కడు నేర్పున గ్రుమ్మరు వేఁటకాండ్ర రా
రమ్మని వారితో డ్రుత నరణ్యముఁజొచ్చి, మృగాళిఁ ద్రుంపుమా !

ప్రసే—అన్నయ్యా ! ఈవర్షర్తువు గడచినపిమ్మట, వేఁటకు వెడలిన శ్రేయస్కరంబని, నాయభిప్రాయము.

సత్రా—సోదరా ! మనసౌఖ్యములం జూచుకొనుచు, రాజ్యభోగంబుల ననుభవింపుచు ప్రజల కష్టంబులను నివారింపకున్న నది రాజధర్మంబగునా ?

గీ. ఆర్త జనరక్షణంబు రాజ్యాధిపతుల
విధియటంచు వచించిరి విబుధవరులు
స్వసుఖమును విసర్జించియు సౌఖ్యమొసఁగి
ప్రజల రక్షించుటయె కాదె రాజనీతి.

ప్రసే—అగ్రజా ! నేను తమయాజ్ఞ నుల్లంఘించుచుంటిననితలంపకుఁడు. వర్షర్తువగుటచేత, కంటకపంకావృతంబై, నిబిడనికుంజపరిపూరితంబై యరణ్యము క్రూరసత్వంబులకు వాసయోగ్యంబై యుండి మృగయులకు శ్రమాకరంబగునని నేను విన్నవించుచున్నాను.

సత్రా—ఆమాట సత్యమే ! ఐనను, నిన్నిఋతువులో నింతగాఁ దొందఱ చేయుటకుఁ గారణము చెంచునాయకుల మొర నీవు వినియే యుంటివికదా ! అట్టితరి మనము తోడనే యడవికరిగి, వారిబాధలను నివారింపకున్న, "రాజ్యాంతే నరకం ధృవ"మ్మను స్మృతి యథార్థంబగును. ఈపరమార్థ మట్లుండఁగా, దేశీయులందఱును

మనలను బహుతేలికగాఁ జూచెదరు. కావున నీవు త్వరగానరిగి, వారికష్టంబులను నివారించుట శ్రేయస్కరము.

ప్రసే—అన్నయ్యా ! మీయానతిమేరకు వర్తించెదను, సెలవిండు.

సత్రా—మంచిది; సోదరా ! నీవు గజతురగరథపదాతులతోడను, ఆయుధపాణులైన శూరాగ్రేసరులగు వేఁటకాండ్రతోడను, ముసలముద్గరభిండివాలఖడ్గాద్యాయుధములతోడను, జంతువులనుపొంచిపట్టి కఱచి చంపెడునేర్పుగలజాగిలంబులతోడను ఖడ్గకవచాదులను ధరించి, వెడలవలయునే కాని, ఏకాకివై యరుగవలదు సుమా ! ఇదే సూర్యనారాయణమూర్తిచేఁ బ్రసాదింపఁబడి, కృష్ణమూర్తిచే యాచింపఁబడిన శమంతకమణిరాజమును కంఠమునదాల్చినయెడల విపినాంతరసంచారసమయంబున, గాఢాంధకారములో దానిప్రకాశము కొంత సహాయకారిగానుండును. (శమంతకమణినొసంగి) దీనిని బహుజాగరూకతతోఁ గాపాడవలయునుసుమా ?

ప్రసే—చిత్తము ! ఇదే నేనుపోవుచున్నాను. (నమస్కరించును.)

(నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

## రంగము 4.

[కృష్ణుఁడుప్రవేశము.]

(అనుబంధము 8.)

కృష్ణు—(స్వగతము)

గీ. శాపమునుఁ బొందియున్న శశాంకుఁడకట !
పాలలోఁ గానుపించె నీవేళనాకు

నిందవచ్చుట తప్పదు గీ నిక్కువముగ
ననుభవింపక తీరునా గీ యజునకైన.

నేఁటిభాద్రపదశుద్ధచతుర్థిని క్షీరములం బిరుకుచుండ చంద్రబింబము క్షీరఘటాంతరమునఁ బ్రతిఫలించెను. శాంకరీవచనంబు నిరర్థకంబగునా? కానిమ్ము, కానున్నది కాకమానదుగదా! మత్సామర్థ్యముచే నీశాపవిమోచనంబు గావించి లోకోపకారంబు గావించెదఁగాక!

(నిష్క్రమించును.)

తెరవ్రాలును.

## రంగము 5.

ప్రదేశము—అరణ్యము.

[ప్రవేశము—ప్రసేనజిత్తు, మంత్రి, మరికొందఱు మృగయులు.]

ప్రసే—భటులారా! ఈయరణ్య మెంతభయంకరముగనున్నదో కాంచితిరా? దీర్ఘశాఖాపరంపరావృతంబై యాతపంబున కెడమీయక పక్షిసంతతులచే నక్షయంబులై, నిశితకంటకాలవాలంబులై, నిబిడలతాసంకీర్ణంబులై చూపట్టు తరురాజంబులం గంటిరిగదా! తత్సమీపంబునఁ బొదలనఁ బొంచియున్న దుష్టమృగంబు లెంత భయంకరముగా ఘోరారావంబుల నొనరించుచున్నవియో, వినుచుంటిరిగదా?

సీ. సింహనాదంబులు గీ చెవులు చిల్లులుపోవ
వినవచ్చుచున్నవి గీ భీకరముగ
గజముల ఘీంకృతుల్ గీ కడుభయంకరములై
గుండెల నతిభీతిఁ గీ గూర్చుచుండె

సూకరంబులు మహాభీకరంబుగ, శిలా
ఖండాళిఁదొరలించుచుండెనదిగో!
శార్దూల ఘోషలు సాఘాతములవోలె
ధ్వనియించుచున్న విధ్దరఁ జలింప
చిఱుతపులులును చప్పాలు జాకగములు,
నడవిజంతువుల్ బరువిడు నద్భుతముగ
చూడఁజూడఁగ నింకొక చోద్యమొకటి
గానఁబడుచుండె నిప్పుడిక్కానలోన.

సీ. చెవులపిల్లులఁబట్టి చీల్చుటకై పెద్ద
జంబుకంబులుచెట్ల చాటుఁజేరు
జంబుకంబులఁబట్టి చక్కాడగానెంచి,
చిఱుతలు పొదలందు జేరికాచు
చిఱుతలఁ బరిమార్ప నరసెడు రేచులు
దతిజలాశయముల దారి జూచు
రేచుకుక్కలను బొరింగొనశరభంబు,
బర్హామా తరుణంబు నరయుచుండు,
మదగజంబులఁ బొలియింప మండిపడుచు
సింహసంతతి తత్కుంభ సీమలందు,
దుముకనెంచు; భుజంగ పంక్తులువనాంత
రమున నెల్లెడఁ జెరలాడు రభసమునను.

సచివశేఖరా! నాగరికతగల పౌరజనంబును ఈయరణ్యమృగంబులవలె నే, యొకరియభ్యున్నతి నింకొకరు సహింపక యన్యోన్యకలహ సమారంభంబొనర్చునుగదా! దీనివలన, ప్రకృతికెల్ల నన్యోన్యప్రేమ వాత్సల్యంబులకన్న నన్యోన్యవైరభావమే సహజగుణమని తోఁచుచున్నదిసుమా!

మంత్రి—దేవా! కొన్ని అరణ్యమృగంబులకుఁ గొంతజాతిభేదముండుట వలన వైరభావము సహజమని యూహించుట కవకాశముండ వచ్చునుగాని స్వజాతివైరముగలకుక్కలవలె, కుక్కుటములవలె, పొట్టేళ్ళవలె, మానవులు నిరంతరము ప్రాణములున్నంతవఱకు నన్యోన్యవైరంబు మానక, తగవులాడుచు బ్రాణత్యాగంబున కియ్యకొనుటఁ జూడగా మానవుల బుద్ధిహైన్యము వెల్లడియగు చుండునుసుఁడీ!

ప్రసే—

ఉ. సైనికులార! మీరలిటు సంఘముగా నొకచోటఁ గూడి చె
ప్పైనిమృగంబు లెల్లఁ గని బారుచున్నవి కొండలెక్కి యొ
హైన రహస్యవేషముల నక్కివధింపుఁడు లేక యున్న, వీ
లైన విధంబునం జెదరి యాయుధపాణులరై వధింపుఁడీ.

శూరాగ్రేసరులారా! మీలోఁ గొందఱు భేరీమృదంగాది వాద్యనిశే షంబులతో పర్వతపురోభాగంబునకుం జని, బెదరిబెదరి యాతురం బునం జనుదెంచు జంతుసంతానంబును వధింపుఁడు; కొందఱు గుహల యందును, వేఱొకకొందఱు కొండచఱియలయందును, మఱికొందఱు పొదలమాటునను, మిగిలినవారలు, బహిరంగముగను నిలిచి కంటికిఁ గానవచ్చినమృగంబులను సంహరింపుఁడు. మంత్రీ! నీవు నాయకుండ వై యెట్లెట్లు నడుపవలయు నట్లట్లు నడుపుము.

మంత్రి—చిత్తము. తమయానతిప్రకారముగ, వేటను త్వరలోనే నెఱ వేర్చెదము. సెలవొసంగుఁడు.

(నిష్క్రమింతురు.)

ప్రసే—(ఆకాశముం జూచి) ఓహో! క్రమక్రమముగా వర్షమువచ్చు సూచనలు గాన్పించుచున్నవి. చల్లని గాలి వీచుచున్నది. దక్షిణంబునఁ బూర్ణ లావణ్యమేఘానమం బగుచున్నది. ఉత్తరం

బునసయితము ఘోర్వారమహాపద్రవ భయంకరాశనిపాతంబు లగుచున్నవి. పశ్చిమంబున బలువిధవర్ణంబులతో నింద్రధను స్సులు పొడసూపుచున్నవి. గాలియు చినుకులును బెంపగు చున్నవి; ఈవర్షంబు సైనికులం జీకాకుపఱచునో, యేమిసేయు నో యని భీతిగల్గుచున్నయది. (ముందుకుఁజూచి) అదుగో! సచివుఁడు సైనికులతోఁ గలసి వేఁట చాలించి యిటువచ్చు చున్నాఁడు.

మంత్రి—[భటులతోఁ బ్రవేశించి] మహాప్రభూ! జోహారు! ఏలినవారి యానతిప్రకారము మహారణ్యమంతయు నల్లకల్లోలముఁ గావిం చి, యీవర్షప్రభావంబునకుఁ దాళఁజాలక, పరువులిడివచ్చితిమి. మాకేమిసెలవు?

ప్రసే—మంత్రీ! మిగతభటులేమైరి? వారేమైరి? వారిజాడ మీకుఁ దెలిసినదా?

మంత్రి—రాజేంద్రా! కొందఱుభటులు క్రూరమృగంబుల బారింబడి మృతినొందిరి. మిగిలినవారు వెనుకఁజిక్కియున్నారు. మే మీ దెసకు వచ్చితిమి. వెనుకజిక్కినవారును, ఎద్దియే నొక సదుపా యముం జూచుకొనియేయుందురు. మేము తమకును మాకును నిరవగునట్లు పటకుటీరంబుల నేర్పఱతుము. సెలవొసంగుఁడు.

ప్రసే—మంచిది, అట్లేకానిండు. కాలాతీత మైనకొలందియు వర్షమధిక మగును.

మంత్రి—చిత్తము. (భటులతో నిష్క్రమించును.)

ప్రసే—ఆహా! భటులు పటకుటీరంబుల నేర్పఱచుటకైనను విరామ ములు గలుగకుండ అప్పుడే ఘోరవర్షము దిశలను మరింత యంధకారబంధురముగా నొనరించుచున్నది. విద్యుత్కాంతుల

చేతను, మత్కంఠదేశస్థితమగు శమంతకమణికాంతుల చేతను
కొంచెము దారిచూచుకొని సైనికులం గలసికొన నరిగెదఁగాక!

గీ. ప్రళయవేళాసముద్భూత ♦ వారివాహ
వర్గనిర్గత నిర్ఘాంత ♦ పాతభీక
రాతి నిర్ఘోష కలితవ ♦ ర్షాతిశయము
వలన నేమయ్యెనోకదా ♦ భటచయంబు.

మఱికొంతదవ్వఱిగి—వారి నన్వేషించెదఁగాక! (ఇంచుక కలయఁజూచి) అబ్బా! ఎంతవెదకినను భృత్యులజాడ గానరాదయ్యెను. జలాధికంబగు చే, నడుగుదీసి యడుగువెట్టుటకైనను వీలు గాకున్నది.

(తెరలో సింహగర్జనము వినఁబడును.)

ఓహో! ఎక్కడిదో యొక్కకంఠీరవంబు గర్జించుచు నామీఁదికే వచ్చుచున్నది. దానితోఁ బోరాడుటకైన నవకాశము గలుగకున్నదిగదా! ఐనను సాధ్యమైనంతవఱకుఁ బెనగులాడి దానిని గీటడంతునుగాక!

[నిష్క్రమించును, తరువాత ఇరువురుభటులతో మంత్రి ప్రవేశము.]

మంత్రి—అకటా! రాత్రియంతయుఁ బెనుప్రళయమువలె గడచినది. భటులారా! మనము మృత్యుముఖంబుననుండి వెలువడి బ్రదికితిమి. కాని మన ప్రసేనమహారాజును, వెనుకఁజిక్కిన భటులును గాన్పింపరైరి. ఈపాడువేఁట యెట్టికుకార్యఘటనంబులకుఁగారణము కానున్నదియోకదా! అరణ్యమంతయు శోధించితిమిగాని వారిజాడ గాన్పింపదయ్యెను. మార్గంబెల్ల పెనుగాలితాకున విఱిగిపడిన మహోన్నత భూరుహంబులచే నాచ్ఛాదింపఁబడియుండుటచేత, మరికొంతదూర మరిగి యన్వేషించుటకైనను వీలుగాకయున్నయది. పశుపక్ష్యాదుల మృతదేహంబు లెల్ల

యొడల నేల యీనివచందంబునం బడియున్నవి. మనప్రభువు వారును భటులును మృత్యుదేవత కాహారమై యుందురేమో యను సందేహంబును గల్గుచున్నయది. సజీవులైయుండిన నెందును గానుపింపకయుందురా? మృతినందియున్నచో మృతకళేబరంబులైనఁ గానుపింపకయున్న వేమిచిత్రము! ఒకవేళ పట్టణంబున కరిగియుందురేమో అనియుం దోపకయున్నది. నావెర్రియే వారు పట్టణంబున కరుగుటకుఁదగిన సావకాశ మెక్కడనున్నది! మృతినందియుండుటయే నిశ్చయము! పురంబునకరిగిన "నాతమ్ముఁడగు ప్రసేను నేమిచేసివచ్చితి" రని యడిగినచో నేనేమి చెప్పఁగలను? హా! దైవమా! ఎంతదురవస్థనుఁ దెచ్చిపెట్టితివి?

[తత్తరముతో నొక భటుఁడు ప్రవేశము.]

భటు—(ఆయాసముతో) మహాప్రభూ! మహాప్రభూ! ఎంతఘోరము! ఎంతవిచారము!!

మంత్రి—ఏమిరా! ఏమిజరిగినది! ఘోరమనుచున్నావు! విచారమనుచున్నావు! ఏమిజరిగినది! ప్రసేనమహారాజుజాడ యేమైనఁ గాన్పించినదా?

భటు—అయ్యయ్యో! ఇంకెక్కడి ప్రసేనమహారాజు స్వామీ!

మంత్రి—ఆఁ! ఆఁ!! ఏమిరా! ఇంకెక్కడి ప్రసేనమహారా జనియెద వేమి? ప్రసేనమహారాజున కేమైనదిరా!

భటు—ప్రసేనమహారాజు మహారణ్యమధ్యంబున మరణించినారు స్వామీ!

మంత్రి—హా! మహారాజా! అనుకొన్నంతపనియుం జేసి మమ్ము విడనాడిపోయితివా?

గీ. అక్కటకటా! ప్రసేను! బాలార్కభాను!
ఘోరమరణ దంష్ట్రాప్తిని గోరుకొనుచు

నిటుల వేటకువచ్చితివే! కుమార!
యేమనివచింతువారము కేభూమిపలికి!

ఓకీ! భటుఁడా! ప్రసేనకుమారుఁడెట్లుమరణించినాఁడురా! నీవు కళేబరముం జూచితివా! మా కావిషయమునెల్ల విపులముగ నెఱిఁగింపుము.

భటు—అయ్యా! ఆమహారాజెట్లుమరణించెనో మా కాయువంతము తెలియదు. అరణ్యంబున నొక్కచోట శరీరమెల్ల గాయంబులచే రక్తపంకిలంబై పడియున్న మహారాజుశరీరమును కన్నులార గాంచి యేమియుఁదోఁపక, మీ కీవార్త నెఱిఁగింపవచ్చితిమి! ఇంతకన్న మాకధికవృత్తాంతము తెలియదు స్వామీ!

మంత్రి—ఆకుమారుని శరీరమున శమంతకమణిహార ముండవలయు నది యైన కళేబరంబునఁ గాన్పించెనా?

భటు—అయ్యా! కళేబరంబున నట్టిహారమేమియుఁ గాన్పింపలేదు. ఐన ను తమరక్కడకువచ్చి ప్రత్యక్షంబుగఁ గాంచుడు- మార్గము జూపెదము.

మంత్రి—మంచిది- పద.

(అందఱును నిష్క్రమింతురు.)

తెరవ్రాలును.

రంగము 6.

ప్రదేశము—సత్రాజిత్తు కొలువుకూటము.

[ప్రవేశము—సత్రాజిత్తు, శతధన్వుఁడు, కృష్ణుఁడు.]

కృష్ణు—మిత్రమా! సత్రాజిత్తూ!

గీ. భక్తిచేత చండభానుని మెప్పించి
మహితమై వెలుగు శమంతకాఖ్య

రత్నమును బహూకరణముగఁ గాంచితి
వవని ధన్యమూర్తి ! వయ్యనీవు.

క. అసదృశముగ సుభాగ్యాగ్రవు
లసువర్ణము నీవు సంగ్రహసుభూషణయుతహారా
ససహాసమహిమ నీం
త్వసమానము ధాత్రిగల్గు ! ధన్యులుగలరే !

నీవు నేఁటి భూకాంతులయందెల్ల పూజనీయుండవైతివి; ఐనను నాప్రార్థనం బొక్కటిగలదు.

సత్రా—వాసుదేవా ! అదియేమి ?

కృష్ణ—గీ. నేఁటి భూమీశులందున ! మేటియాచు
నుగ్రసేనుఁడు పూజ్యుఁడై ! యున్నవాఁడు;
ఈ శమంతక మాణిని ! యింటనున్న
నధికపూజ్యతఁ గాంచెడు ! నని తలంతు.

నాప్రార్థనంబు నాలకించి, నామాట మన్నించి యీశమంతకమాణిక్యము నుగ్రసేనున కొసంగుము; దీనికిఁ బ్రతిఫలంబుగా—

ఆ. నీవు కోరినట్టి ! నిధుల నెన్నిటినైన
నీయఁగలఁడు యాదవేశ్వరుండు
ధనముగాకయున్న ! ఘన ధనేతరము, నే
నైన నొసఁగ నీయభీష్టములను.

సత్రా—కృష్ణా ! మాయలాడవగు నీవు బాల్యంబునుండియు నొక్క మచ్చున మాయాతంత్రవిశారదత్వంబుననే వర్ధిల్లుచుంటివిగదా !

గీ. బహుతరంబైన ఘోరతపంబొనర్చి
భాస్కరునిఁ దృప్తినందించి, ! పరమపూత
మగు శమంతముఁ దెచ్చితినంట ! దానిఁ
దృణముపలెఁ గోరెనంట శ్రీకృష్ణమూర్తి !

భళాభళి! కృష్ణా! శమంతకంబు నెంత తేలికగా భావించితివి?

సీ. స్నానమాడెడు వ్రజాం గనలచేలములుగా
మది నెంచినావా శ మంతకమును
వ్రేపల్లెవాడలో వెన్న ముద్దలనుగా
మది నెంచినావా శ మంతకమును
విషపూర్ణపూతనా విరళస్తనములంచు
మది నెంచినావా శ మంతకమును
కాళియాహీమహా గ్రఘణోత్తమంబుగా
మది నెంచినావా శ మంతకమును
గొల్లచేడెల వలి గబ్బిగుబ్బలంచు
మదినిఁ దలపోసినావా శ మంతకమును
ఓ భళాభళి! యెంతదు రాశనంది
కోరితివి! రత్నమును వెట్టి గొల్లవాఁడ!

అదిగాక నాసోదరుఁడగు ప్రసేనుఁడు దానినిధరించి యడవికి వేఁటకరిగెను.

కృష్ణు—సత్రాజిత్తూ! ఇంతమాత్రంబున కిట్టిల నిష్ఠురంబుల నాడెదవు. శ్రేష్ఠగుణసమంచితమగు శమంత మ్ముగ్రసేనునికడనుండ నర్హమైనదని తలంచి యర్థించితిగాక! నీ వనుమతింపవేని నేను బలిమిం గొనిపోవఁగలనా! నీవు వలదనిన బలవంతము లేదు. నీ శమంతమును నీకడనే యుండనిమ్ము. నే నరిగెదను.

(నిష్క్రమించును.)

సత్రా—మిత్రమా! శతధన్వా! చూచితివే! శ్రీకృష్ణునికురాశ!

శత—మామా! వానికౌటిల్యంబును గ్రహించి నీవు చక్కని ప్రత్యుత్తరంబు నిచ్చితివి. సెబాసు!

గీ. వెట్టిగొల్లఁడె కృష్ణుఁడు వెకలియగుచు
తరణిదత్తంబయిన శమంతకంబు నడిగి

మొగము వెలవెలఁ బారంగఁ దెగినయట్టి
యుత్తరమునంది, చనియె నిరుత్తరుఁడయి.

సత్రా—శతధన్వా! శమంతకపూజాసమయంబైనది గావున, మనము పూజించుమందిరమున కరుగుదము రమ్ము.

(ఇరువురును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

రంగము—7.

ప్రదేశము—సత్రాజిత్తు మందిరము.

[ప్రవేశము :—సత్రాజిత్తు, శతధన్వుఁడు.]

సత్రా—శతధన్వా! ఈదినం బేమోకాని నా వామనేత్రం బదరుచున్నది. గతరాత్రి కొన్ని దుస్స్వప్నంబులు వచ్చుటయేగాక యీదినంబునను కొన్ని దుశ్శకునంబులును గాన్పించుచున్నవి. దీనికిఁ గారణ మేమైయుండునో తెలియరాకున్నది. అరణ్యంబున కరిగిన నాసోదరుని వార్తయుఁ దెలియరాకున్నది.

శత—మామా! మన ప్రసేనునివెంట నడవి కరిగిన సచివభటాను లదే వచ్చుచున్నారు.

సత్రా—ఏమీ! సచివభటాదులుమాత్రమే వచ్చుచున్నారా! తమ్ముఁడు రాలేదా! అక్కటా! వీరివదనంబులును విచారసూచకంబులై యున్నవి. నేఁ డెట్టిదుర్వార్త వినవలసివచ్చునోకదా!

[ప్రవేశము:—భటులతోఁగలసి మంత్రి.]

మంత్రి—మహాప్రభూ! నమస్కారములు.

సత్రా—సచివోత్తమ! నమస్కారముల కేమిగాని, క్షేమముగ వచ్చితిరా! వేఁట యుక్తంబుగ నెఱవేఱినదా? నాతమ్ముఁ డేడీ?

అందఱు—(తలవ్రాల్చి యూరకుందురు.)

సత్రా—(ఆత్రమున) ప్రత్యుత్తర మీయరేల? ప్రసేనజిత్తు మీ వెంట రాలేదాయేమి? రాకున్న నెందున్నవాఁడు? సత్వర మెఱింగింపుఁడు. నామనస్సు డోలాందోళితం బగుచున్నయది.

మంత్రి—మహారాజా! ఏమని మనవిచేయుదుము?

సీ. తమయాజ్ఞచేత మీ తమ్మునితో మేము
వేఁటకు జని ఘోర విపినమందు
జంతుజాలంబునుఁ జంపి కొన్నింటిని
బోనులలోఁ బెట్టి పులులఁ గొట్టి
గజములనెల్లను ఘాతంబులను వైచి
సూకరంబులనెల్లఁ బోకడంచి
కొండమెకంబుల ఖండించి, తక్కిన
జంతుజాతులనెల్ల సంహరించి
వేఁటఁ జాలించి బసలను వెదకుచుండ
నర్కుఁ డస్త్రాద్రి కరుగ హాహా యనుచు దిశల
గాలివాన విజృంభించి కాననంబు
నెల్లఁ జీకాకువడఁజేసె; నినకులేశ!

రాజేంద్రా! మన ప్రసేనకుమారుండు గాఢాంధకారబాధురంబై వర్షాకులంబైన యక్కాననాంతరంబున దారిదప్పి మమ్ముఁబాసి యెందో చనియె. మఱుదినంబున వర్షంబెల్ల మటుమాయమై సూర్యరశ్మి చక్కఁగా వెలుంగుచున్నంపన భీభత్సంబైయున్న యక్కాననంబున మా కొక్కయెడ రక్తసిక్తంబైన ప్రసేనుని కళేబరము గాన్పించె. కుమారున కట్టిమర్మరణంబు సంభవించుటకు హేతువు నెఱుంగక, యీ ఘోరవార్తను మీ కెఱిఁగింపఁదలంచి యిటువచ్చితిమి. మహారాజా! కుమారుని కంఠమునం గల శమంతంబుగూడ గానరాదయ్యెను.

సత్రా—హా! సహోదరా! ప్రియభ్రాతృవత్సలా! ఘోరారణ్యంబున దుర్మరణంబు నొందితివా! అయ్యయ్యో! ఈపాపపువేఁట నీ ప్రాణనాశనంబునకే దాపురించెనా! నాయనా!

సీ. అనుజుఁడా! వేఁటకుఁ జనుమన్న నీబుతు
వరిగిన జనియెద నంటి వీవు
కఠినోక్తులనుఁ బల్కి కాన కేఁగుమటంచుఁ
బగవానికై వడి బలిమిఁ జేసి
పంపించితిని నిన్నుఁ బ్రజలసౌఖ్యముఁ గోరి
జంతువులను వధియింతు వనుచు
మణినిగ్రహింప దుర్మార్గుఁ డెవ్వఁడో నిన్నుఁ
బట్టి చంపెను పాపభయము లేక
ప్రజల రక్షింపఁ బ్రభులధర్మంబటంచు
ప్రాణివధచేయ బంపిన పాపమునకు
ఫలముగలిగె నీచందాన భవునివ్రాత
దప్పనే యెన్నటికినైనఁ దమ్ముఁగుఱ్ఱ!

సర్వకాలసర్వావస్థలయందును, నామాట జవదాటని నాయనుంగు సోదరా! నన్నెడఁబాసితివా! జనోపయోగార్థమై నిన్నీభీషణవర్షర్తు మధ్యమున వేఁటకుఁ బంపినందుల కీభ్రాతృశోకంబు ననుభవింపవలసివచ్చె. అయ్యో! తమ్ముఁడా! నీమరణవార్త నాలకించినయెడల మనయమ్మ గుండెయెంత పగులునో! నీభార్య యెంతగా విలపించునో కదా!

శత—మామా! శమంతకమణియే ప్రసేనజిత్తు ఘోరమరణంబునకుఁ కారణముగాఁ గనంబడుచున్నది. ఏలనన, నిన్నొకనాఁడు కృష్ణుఁ డాశమంతకమణిం దన కిమ్మని యడిగియుండెనుగదా! అప్పుడు నీచే నిరాకరింపఁబడి కార్పణ్యంబు వహించి మణిని సంగ్రహింతు

నొంచి, మీతమ్ముని వెనువెంట నడవికరిగి వధించి మణి నప హరించి యుండును. సందేహము లేదు.

సత్రా—అల్లుఁడా! నిక్కముగా నాకును అట్లే తోఁచుచున్నది. కానిమ్ము. తమ్మునకుఁ జలోదకంబులనిచ్చి, యాపైన మణివృత్తాంతంబు నాలోచింతము రమ్ము.

శత—(స్వగ) భళిరే! చిరకాలమునుండియు సత్యను వివాహమాడ నేను సంకల్పించియుండఁగా నీశ్రీకృష్ణుఁ డొకఁ డాటంకము వచ్చుచున్నాఁడు. ఈ వేరుపురువును వదల్చుకొనుట కిదియే సమయము. తరుణము దొరికినపుడెల్ల కృష్ణునిపై నీతని కీర్ష్యఁ గల్గింపఁ బ్రయత్నించెదగాక!

(ఇరువురును నిష్క్రమింతురు.)

ద్వి తీ యా ం క ము.



# శ్రీకృష్ణప్రతిజ్ఞ

## తృతీయాంకము.



### రంగము—1.

ప్రదేశము—సత్రాజిత్తు దర్బారు.

[ప్రవేశము—సత్రాజిత్తు, శతధన్వుఁడు, కైరవుఁడు, కంసికుఁడు.]

సత్రా—(లేచి)

సీ. వింటిరా హితులార! వివరంబుగా సూర్య
నారాయణుఁడు మణి నా కొసంగె
దానిని కృష్ణుండు తనకు నిమ్మనిపల్క
నీయక మణిని నా యింటనుంచి
తమ్ముఁడు వేటకై తాఁ జనునప్పుడు
నామణిఁ దనకంఠ హారముగను
ధరియించి చనుచుండ తనవెంట కృష్ణుండు
జని శౌర్యమున వాని సంహరించి
మణిని గొనినెమ్మదిగ నిజ మందిరమున
నొరులకు దెలియకుండఁగ నున్నవాఁడు
అట్లుగాదేని తమ్ముఁ డేమాయె? దీని
జక్కగా మీరు యోచన సలుపవలయు.

(కూర్చుండును.)

శత—రాజేంద్రా! నాకును నవ్విధముననే తోఁచుచున్నది. ఏలనన, ప్రసేనజిత్తసమానపరాక్రమశీలుఁడు, ఆయుధపాణియై సేనాసమన్వితంబుగ నున్నవాఁడు. అట్టితని భేదించి చంపుట కితరులకు తరముగాదు. ఇట్టిదొంగపని యీవెన్నదొంగవలనగాక వేరొకరివలన జఱిగినట్లు తోఁపదు. ఇంతకును శమంతకమాణిక్యమును దనకు మీరొసంగలే దను కార్పణ్యంబు నెద వహించి మీ తమ్ముగుఱ్ఱం దునుమాడి యపహరించియుండును. ఇదినిక్కువము.

కంసి—శతధన్వా! భీషణవర్షపాతంబునం గల్గినప్రమాదంబుచే ప్రసేనజిత్తు మరణించియుండునని మంత్రిప్రముఖులు వచించుచుండ, కృష్ణుఁడే చంపెనని నిర్ధారణం బొనరించుటకు సాహసం బెట్లుగలిగె? సత్రాజిత్తుమహారాజు దుఃఖావేశంబున నస్థిరమనస్కుఁడై యెద్దియో పలుకగా ఆపాటకు నీవు వెనుకనుండి తాళము వేయఁదగునా?

శత—ఓయీ! మంత్రిప్రముఖులు వచించిన వాక్యములను యోచించినను, వెనుకజిక్కిన భటులను ప్రసేనజిత్తు వెనుక నరిగిన తరుణముం గనిపెట్టి కృష్ణుఁడు రహస్యముగా నాతనివెన్నంటి పోకార్చెనని మన మేలసందేహము నందరాదు. శమంతకాపహరణబద్ధకంకణుఁ డగుశ్రీకృష్ణుఁడు, స్వప్రతిజ్ఞానిర్వహణమునకై ప్రసేను నన్యాయముగ సంహరించెనని తలంచుట యసమంజసము కాదు.

కైర—శతధన్వా! నీ వెంతకైన సాహసుఁడవేసుమా! దయాసముద్రుఁడును, సాధుసంరక్షణాసక్తుండును, భక్తవత్సలుండును, అనాధనాధుండును నగు శ్రీకృష్ణుఁడేడ? ప్రాణసమానమిత్రుం డగు ప్రసేనజిత్తును సంహరించుటేడ? చాలు చాలు. ఎవరైన వినిన నవ్విపోదురు.

శత—అలాగుననా ? అతఁ డంతటిమహాత్ముఁడా ?

సీ. గొల్లపల్లెలలోన గోవుల గాయుచు
కన్యల మానభంగంబుఁ జేసి
సతులు మందకుఁబోవు సమయంబు గనిపెట్టి
యిండ్లలోఁ జొరబడి యెఱుఁగకుండ
చల్ల పాలును వెన్న కొల్లలుగా ద్రావి
సన్న సన్నగ బోవ సతులు గాంచి
రోటను బంధించి రోకళ్లతో మొత్తి
ఛీ పొమ్మటన్నను సిగ్గులేక
గొల్లచేడెలు కోకల కొలనుదరిని
దాచి, తత్సరోవరసీమ తానమాడ
చేలముల దొంగిలించియా చెట్టుమీద
దాగినట్టి యాకృష్ణుఁడెం తటి ఘనుండొ ?

కృష్ణుఁడు జారచోరులలో నగ్రగణ్యుఁడు; తత్కారణమున ననేకశిక్షల ననుభవించినాఁడు. నింద్యుఁడు—నీతిబాహ్యుఁడు—మాయావి—ఇంద్రజాలికుఁడు—ఇట్టి మహాగుణసంపన్నుఁడు ప్రసేనునిఁజంపి మాణిక్యము నపహరించె ననుటయం దాశ్చర్యమేమి ?

కం—ప్రతిమానవునకును బాలలీల ప్రత్యేకదోషసంకులమై యుండును; అట్టిదానిం బురస్కరించుకొని, జారచోరాగ్రేసరుండనుట శోచనీయము. అదియైనను గోపికల యభీష్టానుసారకృత్యమే కాని చేసినగాదు. అంతలకు వారు శిక్షించుటయును, విలాసార్థమేకాని క్రోధావేశమూలకముగాదు. అట్టి నందనందనునియందు నిందను వేయుట పాపహేతువు ?

శత—గీ. మదుగునను గాళియొరగు మదమణంచె;
నతఁడు కృష్ణున కేరీతి హానిజేసె;

మేనమామను ధర్మంబు మీరిచంపె;
నిట్టితుంటరి ధరణిపై నెవఁడుగలఁడు ?

కైర—ఓహో ! ఎన్ని నేరముల నెన్నసాగితివి !

చ. గురునకుకట్నమిచ్చెదను కోరుమటన్న హితంపులోగడన్
పరమపదంబు జెందుతన పట్టినిదెచ్చియొసంగుమన్న నా
కరణిఁ గుమారుఁ దెచ్చి గురుకట్నముక్రింద నొసంగినట్టి శ్రీ
ధరుఁడిటుజంపినాఁడనిన ధాత్రిజనంబులు విశ్వసింతురే.

ఇదియునుంగాక, బాల్యంబున కృష్ణుడును, కుచేలుఁడును సాందీపునికడ విద్యాభ్యాసమొనరించినమాత్రంబున నాతని సకలైశ్వర్యసంపన్నునిగా వించి పంపలేదా ? అట్టిదయామయుం డిట్టిఘోరకార్యంబు నొనరించె ననిన వింతగాదా ?

శత—ఏమీ !

క. తనమేనమామనే త్రుం
చిన కరినాత్ముండు పాపశీలుండు ప్రసే
నుని జంపుటబ్బురంబే,
మనమునఁ దలపోయు మెట్టిమాయ్యండితఁడో ?

కం—అయ్యా ! శతధన్వా ! కృష్ణునకు దుష్టశిక్షయు శిష్టరక్షయు నొన ర్చుమహాత్ముఁడని బిరుదుగలదు. దుష్టుఁడైనవాఁడు మేనమామయే కాదు తండ్రియైననుసరే ! ఆతఁడు సంహరింపకమానఁడు; ఈపరమార్థమునెఱింగి మాటాడుము ?

శత—ఉ. పూతనపాలుబెట్టుటకు ముద్దుగ కృష్ణునిఁ జంకఁజేర్చి యా
నాతికుచంబునోటనిడ నాశముసేయఁదలంచి, తోడనే,
భీతిజనింపరక్తమును బీల్చి హతంబొనరించినట్టి సం
స్ఫీతబలుండు కృష్ణుఁడు ప్రసేనుని జంపినటన్న వింతయే ?

ఇదియునుంగాక, శ్రీహరి మణిపురాధీశ్వరుండగు గయుండు, విమానారూఢుండై వియన్మార్గమునం బోవుచు, తమలపాకులతమ్మి నుమియుంగా ప్రమాదవశమునం గృష్ణుని హస్తాంజలింబడినప్పు డాగంధర్వసార్వభౌముని సంహరింతునని ప్రతిజ్ఞ సేయలేదా ? దయాసముద్రుండగు నర్జునునిశరణు జొచ్చిన నాతనికి భయమొసంగి కాపాడెనుగాని లేనియెడ నిరపరాధియైన గయుని కృష్ణుండు చంపవలసినవాండేకదా ! ఇట్టి యన్యాయప్రవర్తనము గల మీకృష్ణమూర్తి ప్రసేనజిత్తును చంపుటయం దేమైన సందియముగలదా ? ఏమి ! ప్రత్యుత్తరమీయ రేల ?

కైర — శతధన్వా !

గీ. ఇంద్రుఁడు శిలల్ వర్షింపఁ బర్వతమును
గోటమీటికి నెగమీటి గోపకులను,
పగనుదయను రక్షించిన వాసుదేవు
నపనిందను మోపుటసత్యముగాదె ?

సత్రా — శతధన్వా ! మనము కైరవకంసికులతో వివాదమెందుకు ? కాలక్రమమున నిజము బహిర్గతము కాకమానదు. వీరిచే కృష్ణునకు సందేశమంపెదను. కైరవకంసికామాత్యులారా ! మీకృష్ణునితో నావాక్యములుగా నిట్లుచెప్పుడు.

సీ. మణినీయలేదని మాత్సర్యమూని, నా
తమ్ముని జంప సద్ధర్మమనుఁడు
స్నేహంబుగానుండి చేసిన ద్రోహంబు
మృత్యువై తన్బట్టి మ్రింగుననుఁడు
చోరునిరీతిగా ఘోరాటవినిఁ జొచ్చి
నిర్దోషిఁ గూల్చుట నీచమనుఁడు
మణిఁ దెచ్చినాను సమర్పించుకొని, నన్ను
జేరి క్షమార్పణ గోరుమనుఁడు

ఏమి యొనరింపఁ గలనని ? యెంచకనుఁడు;
మఱచి యుండినఁ దనకుఁ బ్రమాదమనుఁడు
ఇంక దనకీర్తికిడియె కళంకమనుఁడు
చాటిచెప్పితి నేనుము మ్మాటి కనుఁడు.

శతధన్వా! రమ్ము. నేఁటికిఁ గొలువు చాలింతము.

(నిష్క్రమింతురు.)

కైర—మిత్రమా! కృష్ణునిపై సత్రాజిత్తు భరింపరానియపనింద వైచినాఁడు; కృష్ణునితోఁ జెప్పుమని యింతనిరాఘాటముగ నీతఁడాడుటజూడ, రహస్యముగ, కృష్ణుఁ డీకృత్యము నొనరించి యుండునేమో! మనకు తెలియకుండ నెట్టికార్యమునుగాని చేసియెఱుంగని మనమిత్రుఁ డీవిధముగ నొనరించియుండునా ?

కం—కైరవా! అట్లుకలనైనఁ దలంపరాదు, మనకృష్ణుఁడు సత్రాజిత్తు శమంతమాణిక్యము నడుగుటచే వచ్చిన ప్రమాదముగాని వేరు గాదు; రమ్ము, ఈసమాచారమును కృష్ణునకెఱిగింతము.

(అందఱు నిష్క్రమింతురు.)

## రంగము—2.

## ప్రదేశము—అరణ్యము.

[ప్రవేశము—కృష్ణుఁడు, కైరవుఁడు, కంసికుఁడు, యాదవులు.]

కృష్ణు—మిత్రులారా! ఈమహారణ్యసౌందర్యముచు తిలకించితిరే ?

ఉ. చూచితిరే! మహాతరులు ? చోద్యముగా రవికాంతికడ్డుచే
జాచుచున్న భంగి బలుశాఖలు తారల లీలఁ బుష్పముల్
చూచి, విహంగసంతతులు ? పుష్పొడి రాల్చుచు సంతసించుటల్
చూచిన నీశరత్తుకడు ? సొంపువహింపుచునుండె నెల్లెడన్.

వర్షఋతువరిగి, శరత్కాలము సమాసన్న మగుటచే, నదీనదంబులింకిపోయి, ధాత్రీతలంబు కర్కశమై, నభోతలంబు తెల్లనై వెలవెలంబోవుచు, నరణ్యమంతయుఁ బరిశుభ్రముగనున్నది. రండు; ఇంకను కొంతదూరమేగి చూతము.

సైర—కృష్ణా! పోవుచున్నకొలఁదియు, నరణ్య మతిభయంకరముగా నున్నది.

కృష్ణు—ఔను.

సీ. తరుఘర్షణోద్భవ దవధూమమేగాని,
క్రతుహోమ ధూమంబు గానరాదు;
గండకముఖ్యమృగధ్వానమేకాని,
ఖండేందుధరనుతుల్గానరావు;
నిర్గమాసాధ్యావనీతలంబేకాని,
గమనింప సుపథంబుగానరాదు
కంటకావృతకుడుంగవ్రాతమే కాని,
కనులకింపగుచోటు గానరాదు
ఎండమావులచేతను నిండియుండెఁ;
గాని, దగదీర్చుజలములు గానరావు
పెండ్లినడకలు నడువకీవిపినమునను
రండు; నావెంటనంటి బి రానమీరు.

(అందఱును నడచి వేఱొకచోట నరుగుదురు.)

కృష్ణు—ఆహా! ఈపర్వతద్వయ మెంతరమణీయముగనున్నది?

మ. ఫలపత్రంబులతోడ పచ్చదనముం బై మేఘసంచారముల్;
దులమై వర్తులమై సువాసనల సంతోషప్రదంబైన యీ
కులగోత్ర ద్వయముల్ మహీవనిత వక్షోజాకృతిన్ దెల్ప పి
ల్లలకున్ క్షీరమునిచ్చురీతి మధువాహ్లాదంబుగా నిచ్చెడిన్.

ఫలరసంబులచేతను, పూవుదేనియలచేతను, క్షుత్పిపాసాదిశాంతినిబొంది మార్గాయాసమునుఁ దీర్చికొనుటకుఁ గొంత యనుకూలముగా నున్నది. లేనియెడ మాగతి యేమికావలయును ?

కైర—(చెట్లచాటుననుండి) కృష్ణా! దాహము, దాహము.

(ప్రవేశించి భూమిపైఁ బడును.)

కృష్ణు—(పూవుదేనియలచేదాహముదీర్చి) కైరవా! నీ వట్లదరిపడివచ్చుటకుఁ గారణమేమి ?

కైర—మిత్రమా !

గీ. మెకము దరిఁజేరి వచ్చినాకిమీఁదఁబడియె;
మేను దెలియక వచ్చి నీకిమీఁదబడితి;
నడువలేనయ్య ! నే నిఁక నడవిలోన,
నెత్తుకొని పోవలయు మీకిచిత్తమింక.

గుండెలదఱుచున్నవి. ఒడలు కంపించుచున్నవి. ఘటము నిల్చులాగున కనఁబడదు. కృష్ణా ! నన్నెట్లు కాపాడెదవో, నీదేభారము.

కృష్ణు—గీ. ఆయుధంబులు లేకుండ నడవికిటకు
వచ్చుటే తప్పు; మిమ్ముర్రా వలదటంచుఁ
జెప్పుచుండఁగ వచ్చితి రిప్పుడైన
వెనుకఁ బడకుండ వేగనా వెంటరండు.

భోజనముకడఁ గన్బరచు మీపాండిత్య మీయరణ్యగమనములందు పనికి వచ్చునా ? మీయిష్టానుసారముగ వచ్చినయెడల మీకు శ్రమగల్గుటయే గాక నేను వచ్చినకార్యము గూడ చెడును.

కంసి—మిత్రమా ! నీవు వచ్చినకార్య మెద్దియో యిప్పుడయిననుఁ దెల్పెదవా ?

కృష్ణు—అట్లయిన వినుఁడు; సత్రాజిత్తు మహారాజు శ్యమంతకమణినడుగుటచేత, అన్యాయముగనాపైఁబడిన నిందానివారణార్థమై మణి

సమేతుఁడైన ప్రసేనజిత్తుజాడలను గనిపెట్టి, నిజమును వెల్లడించుటకై వచ్చితిని. మిత్రులారా! పురాకృతకర్మఫలం బనుభవింపకతీరునా? మీరుగూడ నాతనిజాడల నరయుచు నావెంట రావలయును.

కైర—గీ. మీర లాశమంతకమణికై గోరనేల?
వార లనుమానపడి మిమ్ము వేదూరనేల?
నింద పైవైచుకొని యిట్లు వెదుకనేల?
తప్పు నీయందెకలదు యాదవకుమార!

కంసి—ఓహో! మేము భద్రముగా మూటగట్టుకొని తెచ్చినసందేశమునకు ఫలమా యీ నిశ్రమయుంతయును. మిత్రమా! కృష్ణుని యాజ్ఞానుసారముగ ప్రసేనజిత్తునిజాడల నరయుదమురమ్ము.

(అందఱును కొంత తడవు వెదకుట నభినయింతురు.)

1 యాదవుఁడు—కృష్ణస్వామీ! అల్లదిగో! యేదో జంతువు చచ్చిపడినట్లు కనఁబడుచున్నది. అచ్చటికి బోయి చూతమురండు.

(అందఱును పరిక్రమించి పరిశీలింతురు.)

2 యాద—ఇది యశ్వమువలెనున్నది. అడవిగుఱ్ఱము కానేరదు. దీనిం బట్టిచూడ నిది ప్రసేనజిత్తుదేమో యనునాశ జనించుచున్నది.

కంసి—అట్లైనఁ బ్రసేనుఁడే కానోపును. దీనిని విడిచి యెందే నరిగియుండునా? లేక మృతినందియుండునా? మృతినొందియుండినచో వానికళేబర మేమైయుండును? అరణ్యమృగము లెవ్వియైన భక్షించెనని తలంతుమనిన, నట్టిచిహ్నములైనఁ గాన్పింపవే?

కృష్ణ—త్వరపడకుము. మరికొంతతడవు పరిశీలించిన నవ్వియుఁ గాన్పించును.

యాద—అల్లదిగో! శవము; శవము.

కృష్ణు—(సమీపించి) ఇది గతజీవియై కాలముగతించుటచే రూపవికృతి నందిన ప్రసేనునికళేబరమే యనుటకు సంగియము లేదు.

కైర—అట్లైన శమంతకం బీతనికంఠసేమం గాన్పింపని హేతువేమి ?

కృష్ణు—నిక్కముగా. ప్రసేనుండిందు గతజీవియై మిగుల శోచనీయ స్థితి యందు పడియున్నవాఁడు. ఇతని గళభాగముసంగల మణికాంతులకు భ్రమంపడి తదాశచే, నెవ్వఁడో యీతని వధించి మణి నపహరించియుండును. (పరిశీలించి) ఈకళేబరమునంగల గాయంబులం బరికించిచూడ నేదియేని యొకజంతు వీతనిం జంపినరీతి గాన్పించుచున్నయది.

కైర—మాధవా ! ఇచ్చట నేవియో కొన్నిమృగపదచిహ్నములవలె నున్నవి. చూడుఁడు.

కృష్ణు—మిత్రమా ! ఇవి మృగపదచిహ్నములుగావు; మృగరాజపద చిహ్నములు. వీనిజాడల ననుసరించి యరిగితిమేని, సర్వమునుం దెలియనగును. ఈయరణ్య మతిభయానకమైయున్నది. కడు జాగరూకులరై నావెంటరండు.

ఉ. ఈగుహచెంత సింగము మహీధరమట్లు బరుంటెఁగాన, నే
నేగతినైన దాని వధియించిశమంతకమానికంబు, స
ద్వేగమె దెత్తు మీర లలవృక్షముచాటున జాగరూకతన్
దాగి వసింపుఁడే నిపుడు తక్షణ మచ్చటికేగివచ్చెదన్.

(చెంతకుఁ జని, నిదానించి) మిత్రులారా ! రండు ! రండు !! ఇదియును మృతినందినట్లు యున్నది. (అందఱును సమీపింతురు.)

కైర—(పరిశోధించి) మిత్రుఁడా ! దానిచెంతగూడ శమంతకమణిలేదే ! ఇది మఱియు నద్భుతముగ నున్నదే !

కృష్ణు—ఓహో ! మహాబలపరాక్రమసంపన్నుఁడెవ్వఁడో వీనినివధించి యామాణిక్యముం గొనిపోయినట్లున్నదే ! జంతువు సంహరించి

యుండుననుట కిది మృగరాజు గావున మర్త్యుఁడే దీనిని సంహ రించియుండనోపును.

కం—మానవుఁడే వధించియుండిన మణి మనకు లభ్యమగుననియే భావింప వచ్చును.

కైర—మిత్రమా! ఇంకను పదచిహ్నములననుసరించి పోవుదమురమ్ము. అవి సరిగా నీగుహాలోనికే యున్నవి. జనార్దనా! గుహాలయందు ఋషీంద్రులే కాని బలవంతులు వసింతురా?

కృష్ణ—ఏమైనఁ గానిమ్ము; ఈయడుగులజాడ ననుసరించినచో మనసం దేహానివృత్తియగును. (పరిశీలించి) వీనింజూడ నెద్దియో బల మైన జంతుపదచిహ్నములవలె నున్నవి. ఆమృగం బెద్దియో నే నొంటరిగ నిందుబ్రవేశించి కన్గొనియెదఁ గాక? అంతదనుక మీ రిట వేచియుండుఁడు.

కైర—శా. నీవే యీగుహనొంటిగాఁ జనినచో నీవెంట రాకుండనో
దేవా! మేమెటుబాసియుండెదము? హా! యిది క్కెవ్వరీకానలో
శ్రీవారేకదయెట్లుఁజూచినను మీ రిచ్చితంబుమాభాగ్యమున్
సేవాతంత్రపరాగ్రమా నసులమై సేవింతు మశ్రాంతమున్.

కృష్ణ—మిత్రులారా! మీరు వచ్చుటకు వలనుపడదు. ఈగుహం జూడ కడునంధకారబంధురముగానున్నది. దీనియందున్నవాఁ డెట్టిబల శాలియో, స్థితినిఁబట్టియోచింపుఁడు. ఒకవేళ వానితో యుద్ధమే సంభవించు నెడల, వానితోఁ బోరాడుటయు, నిరాయుధులరగు మిమ్ముఁ గాపాడుటయు బహుకష్టతరముగనుండును. కావున నా యాజ్ఞను జవదాటక, మీరిచట నే యుండుఁడు.

యాంద—(యోచించి) తగునంతకాలము వేచియున్నను మీరురానియె డల, మేము గుహంబ్రవేశింపవచ్చునా?

కృష్ణు—అల్లంతమాత్రమునుఁబ్రవేశింపఁజనను. నారాక కిసువదిదినముల వఱకును, నిరీక్షించిచూడుఁడు. నేను రానిపక్షమున, మీరు మీ మీగృహంబులకరుగవలసినదే కాని, యొంతమాత్రమును గుహం బ్రవేశింపఁ గూడదుసుఁడీ ! ఊరకుండు రేల ?

అంద—తమయాజ్ఞాప్రకారము వర్తించెదము.

కైర—ప్రియమిత్రమా! మీయాన జవదాటువారమో కామో యెఱుంగవా ?

కృష్ణు—మంచిది. మిత్రులారా ! ఇదే నాప్రతిజ్ఞ నాఁగ్గింపుఁడు ? మిత్రులారా ! నా కిఁక సెలవిండు.

అంద—వాంఛాఫలసిద్ధి రస్తు.

కృష్ణు—(గుహాభిముఖుఁడై చేతులుజోడించి.)

ఉ. ఎవ్వఁడు లోకసృష్టికరుఁ డెవ్వఁడులోకచయాదిపావనుఁ
డెవ్వఁ డనంతశక్తి ధరుఁ డెవ్వఁడజాతసుపర్వసేవితుఁ
డెవ్వఁ డమాపుఁ డెవ్వఁడు పరేశ్వరుఁ డెవ్వఁడు మోక్షదాయకుం
డవ్విమలాత్ము నాత్మభవు నాత్మ భజింపుచునిందుఁజొచ్చెదన్.

తెరవ్రాలును.

తృతీయాంకము.



# శ్రీకృష్ణప్రతిజ్ఞ

## చతుర్థాంకము.



### రంగము—1.

ప్రదేశము—గుహ.

[ప్రవేశము:—కృష్ణుఁడు.]

కృష్ణ:—(ప్రవేశించి) ఆహా! ఈగాఢాంధకారమున నెటులఁబోవుదును? కొంతదూరమున నేదియో వెల్గుగాన్పించుచున్నయది. మెల్లఁగా నటకేగెదఁగాక?

చ. అడుగులజాడఁ బట్టి మది నాసజనింప విశేషదూరముం
దడబడుచుఁ మహావిపిన దారుణభూములనెల్లఁ ద్రొక్కి యీ
యెడమణిచిక్కునంచు గుహ నెంతయుఁ జొచ్చి మతిభ్రమంబుచే
నెడతెగకుండ జూడనది యెందునుగాన నిఁకేమిసేయుదుఁ?

జంతువులజాడంబట్టి, యెంతయో యాశతో నింతవరకేతెంచి, చెంతనున్న మిత్రులనువిడిచి, యీగుహాంతరాళమం బ్రవేశించి, యెంతవెదకినను, సుంతైనగానరాదయ్యె. (కొంతదూరమునడిచి) ఆహా! ప్రకాశవంతమగు నీప్రదేశమున కింతసేపటికరుదెంచితిని. ఇచ్చట జనసంచారము స్సైతమున్నట్టున్నదే! ఆహాహా?

క. మగువల జాడం దెలిపెడు
సొగసగు నొక మారుతంబు శుభగతిఁదోఁచెన్
నగయుత మధ్యస్థలమున,
మగువలుగలరన్న సంభ్రమంబగుగాదే ?

ఓహో ! ఏమీయాచిత్రము ! మృగమధ్యస్థలమున మృగమధ్యలుండుటెంతవింతే ? (నిదానించిచూచి) అదిగో ! తొలకరిమెఱుపువలె నాపొదల మాటున నేదియో ప్రకాశించుచున్నది. అదికాంతయో? కాక నాభ్రాంతియో ? ఇది నిశ్చయముగ కాంతయే ! ఆపూవుంబోఁడి పూవులంగోయుచున్నట్లున్నది. హాయి ! హయి ! ఈ సుందరాంగి యెవ్వతెయై యుండును ?

క. ఈవనిత యిచటనుండుట
కీవన మేనోము నోచె నీమె యెవతెయో
కేవలము దేవతాంగన
గావలె కాకున్న నింత కాంతిగలుగునే ?

ఓహో ! ఈసుందరాంగి వనదేవతయో, లేక గరుడగంధర్వయక్షకిన్నర కింపురుష విద్యాధరాంగనలలో నొకతెయో యైయుండవచ్చును. మానవాంగనయైన నింతయనల్పలావణ్యరూపరేఖావిలాసంబు లెట్లు గల్గును ?

గీ. బాల గళసీమఁద్రేలుము త్యాలసరులు
తండులములని పొక్కిలి నుండి వెడలి
భ్రాంతిచేవచ్చు చీమల బారనంగ
మించుబోణికి నలరారు మెఱుగుటారు.

సీ. కర్ణనాసాక్షులు కన్బొమల్ నవసంఖ్య
చాంపేయకువలయ చాపములను,

ఫాలకపోలోష్ఠ ¦ వక్షోరుహంబులు,
నర్ధేందు ముకుర కుంభాంకములను,
దంతహాసాలక ¦ తనుభవకాంతులు,
కుందేందుదీప్త్యబ్ద ¦ కుందనముల,
గళమూరువుల్ కౌను ¦ కరచరణంబులు
శంఖరంభానభో ¦ శాఖవనజ
ములనుహసియింపుచూడె నీసముదిత దీని
నెంచివర్ణింపఁ దరమే? ¦ విరించి కేని
పంచబాణుఁడు నన్ను ¦ బాధించుచుండె
పొంచి దీనిని నే దొంగిలించువాఁడ.

ఏమి? ఈయంగనామణియంగసౌష్టవము! ఎంతవర్ణించినను తనివితీర కున్నయది. దీని యాకారముంగాంచిన మతి పరిభ్రమించుచున్నయది! అచ్చరంబోలిన యీమచ్చకంటి నిచ్చటఁ గాంచి యచ్చెరువొంది వచ్చిన పనియేమో మఱచితి. అల్లదే శ్యమంతకమణి యీబాలికకళయ్యాతలం బులకమర్పఁబడియున్నది. దీనిని మఱపించి యీమానికంబు నెటులైన గ్రహింపవలయు. లేనిచో, విఘ్నములు సంభవించెనేని వచ్చినకార్యంబు నకు విఘ్నంబుగల్గు. మణి చేజిక్కిన పదంపడి, కన్యావిషయంబుయోచిం పనగు. దృగ్గోచరయగుచున్న యీబిబ్బోకవతిని విడచుటెట్లు? నామ నం బిప్పుడయస్కాంతముచెంత నినుమువలె నీనారీరత్నమువంక కాకర్షి తంబగుచున్నయది అక్కటా! నాకీమెలభించునో తుదకు లభింపదో తెలియకున్నది.

[తెరలేవఁగా చంచలాక్షి చకోరాక్షియను, చెలులతో
వనవిహారము సలుపు జాంబవతి ప్రవేశించును.]

జాం—చకోరాక్షీ! ఈపుష్పవనంబును బరికించితివా?

*ఉ. మల్లెలుమొల్లలున్ కుసుమ మంజరులెల్లను వింతరంగుచే
నెల్లెడలన్ ప్రకాశముగ నెంతసువాసన లిచ్చుచున్నవో
చల్లనిపిల్లవాయువులు సంకులమై వెదఁజల్లుచుండె నో
పల్లవపాణి! కాంచుము శుభావహమైనలుదిక్కులందొగిన్.

చకో—చెలీ! ఆశుభం బెద్దియో తెల్పెదవా?

జాంబ—సఖీ! మనము విహరించుతరి, నిట్టూర్పులతో విడచు విషవాయువులనుఁ బీల్చి, మరల మనము బీల్చుటకు ప్రాణవాయువులను వదలి యారోగ్యముం గలిగించుచున్నయవి. చెలీ! ఆరోగ్యమునకన్న నానందమేమిగలదు?

చ. పికశుకశారికాది ఖగబృందములెల్లమనోహరంబుగా
నొకతరిగానమున్ సలుపుచున్నవి వీనులవిందుగా నహో!
సకి! కనుగొంటివాకొలను చల్లని నీరము సారసంబులున్
వికసితమై రవంబులతివింతగఁ దోఁచెఁజకోరలోచనా!

చంచలాక్షీ! ఈకొలనింగాంచువారికే యింతయానందము గల్గుచుండ, నింకుజలక్రీడలొనరించు సరోజముఖుల కెట్టిప్రమోదంబు గల్గునో కదా!

చంచ—చెలీ! నిజము. మనబోటికాంతలకు మనోవ్యథలం బాపుటకై పెద్దలిట్టివనవిహారముల నేర్పఱచియుంకురని తోఁచుచున్నది.

చకో—ఓసీ! చంచలాక్షీ! ఏమంటివి? ఉద్యానవనములు మనవంటివారికి మనోవ్యథలంబాపుటకే యేర్పఱుపఁబడెననియా? నాకట్లు తోఁచుటలేదు. ఏమంటివా?

గీ. అల్లభూజంబునను నల్లిబిల్లిగాను,
నల్లియుండినలతచంచలాక్షి! కనుము;
దంపతులభావములను సూచింపుచుండె
విరహితుల కెంతకష్టమో వెలదిమిన్న!

ఇట్టివింతలం జూచినప్పుడు, మనవంటివారికి మనోవ్యధ హెచ్చుననియె నా యభిప్రాయము.

చంచ—చెలీ! "కాటిమీదగంగానమ్మకు కూటిమీద నేలోక"మనినట్లు నీకెంతసేపును మగనితలంపేకాని, మరియొకటిగానరాదు. చల్లగాలి, చెట్లనీడ, లతావిశేషములు, సరోవరశృంగారములు, చూచుచు, తోటికాంతలతో నుల్లాసముగా విహరించునప్పు డానందముగాక వ్యధయేల ?

చకో—ఆనందమా ? కాదు, కాదు. నిశ్చయముగ వ్యధయే ! కన్యకామణులకు శుకపికశారికాదిగానామృతరసభరితమైన శృంగారవనములందు తమతమమనంబుల కిష్టులగు సుందరపురుషులు దృగ్గోచరులైనప్పుడుగాని, మనోలగ్నమైనప్పుడుగాని మన్మథోద్రేకముచే నెందఱుకన్యకామణులు మూర్ఛలొందిరికారు. వారి చరిత్రములు నీవెఱుంగవా చెప్పెదానా ?

చంచ—సఖీ ! నీవు చెప్పినవిషయములు నాయకీనాయకుల కత్యంతానురాగముగానున్నతఱి, వియోగసాగరమగ్నులై దృగ్గోచరముగాక యున్నప్పు డట్టియవస్థ తటస్థించునేకాని విలాసార్థముగా విహరించువారికి సంతోషముగాకేమి ?

చకో—అలాగుననా ?

గీ. ఎన్నినీతులు చెప్పినఁ జిన్నగున్న
తియ్యమామిడిచిగురులు దిని పికంబు
గానమొనరించనేని నీ గాత్రమైన
బులకరింపక మానునే పూవుబోణి.

వయః ప్రాదుర్భావముగలమందయానల కట్టి మన్మథోద్రేకము జనించు నంటినే కాని, సర్వత్ర చెప్పినమాటయా యేమి ?

చంచ——అటులకాదు. కాదు. ఇప్పుడాయవస్థ నీకే తటస్థించినట్లుకనఁబడు చున్నది. నిజముగా నీకు మూర్ఛయే సంభవించినయెడ నిప్పుడు శైత్యోపచారములుచేయుట బహుకష్టము ?

జాంబ——చెలులారా! మీవాగ్వివాదము బాగుగనేయున్నది. ఇఁకకట్టి పెట్టి పూజకువలయునన్ని పుష్పములను గోయుఁడు.

కృష్ణ——ఓహో ! ఈవృక్షంబులు మధురఫలసందోహంబుల నొసంగుట యే కాక, నూతనఫలపత్రసమేతంబులై శుకపికముఖవిహంగము ల కాశఁజూపుచు, నిర్గళితసకలవృక్షవిశేషఫలరంధ్రప్రవర్షితమరం దసందోహపానానందేందిందిరఝాంకారనినాదసమాకీర్ణంబై యతి మనోహరంబుగ పిల్లవాయువులు చల్లగవీచుచు, మధ్యాహ్నకా లసమయంబున మహాకఠోరార్కకిరణజాలంబులఁ బ్రసరింపనీయక పాంథజనంబులకు హృదయోల్లాసమును గలిగించుచున్నవి.

సీ. రమణీయమగువింత ✽ రంగులపొంగారు
వివిధపుష్పంబులు ✽ వెలయుచుండె
ఫలభరితంబులై ✽ పాదపశాఖలు
భారంబుచేఁగడు ✽ వంగియుండె
శారికాకీరముల్ ✽ శాఖలపైనుండి
కోకంబులను గూడి ✽ కూయుచుండె
మదమరాళంబులు ✽ మృదుగమనంబుచే
బారులుదీరిచి ✽ పారుచుండె
నెమిలిసంఘంబులెల్లపిం ✽ ఛములువిప్పి
యాడుచున్నవి మాయురే ✽ వేడుకలరఁ
గనులపండువుగాగని ✽ కాననమునఁ
బూర్ణసమ్మోదమొదవించెఁ✽బూవుఁదోఁట !

జాంబ——చెలీ! చకోరాక్షీ! ఆప్రక్క మిగులవికసించినపుష్పములు గలవు. వానినిమాత్రమే కోయుము.

చకో——జాంబవతీ! ఈమొగ్గలుగూడ కొంతిసేపటికి వికసించును. అందుచే వీనినిఁ గూడ కోయుచున్నాను.

జాంబ——తలోదరీ! లోకమునందెవ్వరైన పక్వపదార్థములనే కోరుదురుగాని, యపక్వపదార్థములను గోరుదురా? అపక్వపదార్థములనుఁ గాంచి సంతసించుటకేగాని తత్కాలోచితమైన యనుభవమునకు యోగ్యములుగావు. అందుచే ప్రతివారును సిద్ధాన్నమునే కోరుదురు. వాటియందుపయోగముహెచ్చు.

చకో——నిజమేకాని, కాఁబోవుదానియందున్నంతప్రేమ, ైమైనతరువాత నంతగానుండదు గదా! ఆకారణముచే దానిం గూడఁ గోయుచున్నాను.

జాంబ——చెలీ! ఎంతభావగర్భితముగఁ జెప్పితివే! అటులనే కోయుము.

కృష్ణ——సీ. తరుణీముఖారవిందముగాంచునిర్ధన
మనుజునికైనను ధనముగల్గు
పడతివాల్గన్నులు పరికించువారికి
భావమునందుకంపంబుగల్గు
లలితాంగిముద్దుపల్కులుచెవిసోకిన
వారల కానందపదవిగల్గు
సకియ కేగంటిప్రసారంబుఁగనుగొన్నఁ
దామసికైన శాంతంబుగల్గు
ముగ్ధగుమ్మనుగనుగొన్న ముదుకఁడైన
ముదిమివిడనాడి యౌవనమును వహించు;
తుదకు సన్యాసియైన నీ తోయజాక్షి
దర్శనంబైన తపమెల్ల ధార విడఁడె?

శా. ఈనారీమణిపొందు గల్గనిభవం బేలా మనుష్యాళికిన్
దీనిం గౌఁగిటఁ జేర్చి ముద్దుగొని యొంతేఁ బ్రేమవాటిల్ల బ్ర
హ్మానందంబునుఁ గాంచనట్టిబ్రతుకే లా? భోగమేలా? మహా
దానద్రవ్యసుఖాదిసంపదలు సంతానంబులేలా? యికన్.

జాంబ—చెలులారా! నేఁడు గోసినపుష్పంబులు గౌరీపూజకు సరిపడి యుండునా?

చం—మరికొన్ని కోసినఁగాని చాలవు. (కోయుచున్నను.)

కృష్ణ—నేనిట్టి యనన్యలావణ్యవతి నెన్నఁడునుం గాంచియుండలేదు భళిరే! సౌందర్యము!

సీ. బురదలోనుండుట పరమనీచంబని
కెంపు మోవిగమారి యింపుగాంచె
కరులుపెకల్చునన్ వెఱపుచే కంజముల్
కాంతలోచనములై ఘనతఁ గాంచ
నల్లత్రాచలముంగిపిల్లకు భయమంది
పడతినూగారుగా బరిణమించె
వెన్నెలలోఁ గాంతి సన్నగిల్లు నటంచు
నక్షత్రములు కాంతనఖములయ్యె
పురములకుఁ దాళలేక నీపూవుబోణి
దేహముగమారి పుత్తడి దీప్తిగాంచె
నటులఁగాకున్న నీసుందరాంగికింత
బలము తేజంబు రూపంబు గలిగియున్నె?

ఆహాహా! ఈజగన్మోహనాకారి సిగ్గుచే తటస్థముగా నుండెనా యేమి? దీనియభిప్రాయ మేమైయుండునో తెలియకున్నయది! నన్నొక యున్నత పురుషునిగా నెంచి, లక్ష్యముగఁ జూచినట్లుగాని, లేక, సామాన్యునిగ

నెంచి, నిరసించినట్లుగాని తోఁపదు. (నిదానించి చూచి) ఆహాహా!
దీనిని పరిగ్రహింపనిదొకజన్మమా ?

శ్లో. వనాంతరస్థాంచితసుందరాంగీ
సురాంగనా కిన్నరకామినీ వా
నచే దియం సా కథమద్య మన్మనో
హ రేద్ధృతంమేరుమహీధరాదపి.

శ్లో. త్యాజ్యానచోరాస్సహసానిబధ్య
ఇతిప్రసిద్ధాబుధలోకవాణీ
తస్మాదిమామ్ మానసహారిణీంమె
నైవత్యజేయం నిరవద్యరూపాం.

జాంబ—చెలీ! చంచలాక్షీ!

ఉ. కోరిన పూవులెల్ల సమకూర్చుచు సూత్రముతోడదండగా
జేసి మదీయకంఠమునఁ జేర్పుము కొన్నిటి పూలసజ్జలో
వేసియు మా సమార్చనకు వేగ మమర్చు సమస్తద్రవ్యముల్
భాసురగాత్రి! నే నిపుడె వచ్చి సమర్చన మాచరించెదన్.

(చంచలాక్షి నిష్క్రమించును.)

జాంబ—(చకోరాక్షితో) చకోరాక్షీ! నీవు త్వరితముగఁ బోయి స్నానాదికృత్యములను నెఱవేర్చుకొనుటకుఁ దగినపరికరములను సంసిద్ధముచేసి నన్నుఁ బిలువుము. అంతదనుక నే నీ యుద్యానవనముననే విహరించుచుండెద.

(చకోరాక్షినిష్క్రమించును.)

కృష్ణు—భళిరే!

ఉ. దీనిముఖాంబుజంబుఁ గనుధీజనవర్యునకైన నిర్మల
జ్ఞానమువీడి మన్మథనిశాతశరాహతులన్ గృశించి, య

జ్ఞానపయోధిమగ్నులయి ॥ సంతతముం జరియింపకుందురే ?
కాన, లతాంగి కౌఁగిఁటినిఁ ॥ గాంచని నాదగుజన్మమేటికిన్.

గీ. వేగమె దీనిపొందు లభింపదేని,
రాజసంభేద ప్రాజ్య సామ్రాజ్యమేడ ?
భోగమేడ సంభోగానురాగమేడ ?
యవని నాకిఁక కృష్ణనామాంకమేడ ?

ఓహో !

గీ. "పవనపర్ణాంబుభుక్కులై ॥ భ్రాంతులుడుగు
నట్టియోగులకైన మోహంబువొడము
నెలఁతసౌందర్య మహిమ వర్ణింపఁదరమె ?
ధాతకైనను వానిముత్తాతకైన."

ఆహా! ఈబాలికామణిమనోనిశ్చయముంజూడ బహుగూఢముగనున్నదే! కార్యాంతరమిషంబులం జెలిమికత్తియల నావలకంపుట జూడ, నన్నుఁ గాంచి యాస్థలంబు వీడఁజాలక తానొంటరిగ నున్నయట్టుల స్ఫురింపు చున్నయది. అయ్యో ! నాకంతటి యదృష్టముబట్టునే ? కాముకులిట్లు తలంచుట సహజమే ! ఏదియెట్లైనను భావగర్భితముగ నున్నపుడూరకుండుట మంచిదిగాదు. ఇప్పుడీమె యేకాంతముగ నున్నదిగావున—

గీ. ముందుగా నీమెఁబిలచెద ॥ నందుపైని,
వినకయుండిన వేడెద ॥ వివిధగతుల
నంతకును రాకయున్నచోఁ ॥ జెంతకరిఁగి
పాదములపైనిఁ బడియైన ॥ వశమొనర్తు.

(ముందునకుఁ జని)

శా. ఇంతీ ! యెవ్వరిదానవీవిచట నీకన్నెవ్వారలీఘోరమా
కాంతారంబుననున్న కొండగుహాలో ॥ కంజాక్షి ! యిట్లుంచె, నీ

కాంతుండెవ్వఁడు? తల్లిదండ్రులెవరో ? గ్రామంబునున్ నామమున్
శాంతస్వాంతముతో మదీయస్మృతికిన్ ? శ్రావ్యంబుగందెల్పుమా ?

జాంబ—(అదరిపడిచూచి మాటాడకూరకుండును.)

కృష్ణు—గీ. ఇంతసిగ్గేల నీకునో ? దంతిగమన !
సూనశరుబాణములకు నే ? స్రుక్కి నీకు
పల్కులను వినఁగోరిన ? పలుకవైతి
విటుల మౌనంబుదాల్చిన ? నేమిసేతు ?

కాంతాలలామా !

ఉ. కొండలలోననుండిమది ? గోర్కుల నెల్ల నశింపఁజేసి, నీ
నిండగు యౌవనాంకురము ? నేలనుఁ గల్పఁగనేల? నిన్నుఁకన్
పెండిలియాడినన్ మిగుల ? ప్రేమదలిర్ప సుఖించిసంతతా
ఖండలవైభవంబుగని ? కాంతలలోన వెలుంగకుందువే ?

ఉ. నావెనువెంట వచ్చిన ని ? నారతమున్ నిజసౌధసీమయం
దోవనజాక్షి నిన్నునిచి ? యుజ్వలరక్తి వహించి ప్రేమతో
భావజకేళిసల్పుచు ని ? పారముదంబున గాంచుచుండినన్
భావమునందుసమ్మదము ? వర్ధిలఁగాదె' సరోరుహాననా !

కాంతా ! నిర్దయంబూనక, నీమృదుమధురోక్తులచే నాయుల్లముం జల్లఁ బరపుము.

జాంబ—(స్వగతము) ఈమానవుం డెవ్వఁడై యుండునో. తెలియకు న్నది. అన్యకాంతను గాంచి, సామాన్యురాలినిగాఁ దలంచి భయవర్జితుండై భాషింపుచున్నవాఁడు. నాకెద్దియేని మోస ముం దలంపఁడుగదా ? (ప్రకాశముగా) అయ్యా ! నీవెవ్వ వాఁడవు ? ఎటనుండివచ్చితివి ? తలిదండ్రులచాటువానివలె న న్నాఁడవు ! పోతుటీఁగకైన జొరనశక్యంబగు నాగుహాంతరా ముం జొచ్చినదేగాక, నన్నుసమీపించి పలుకరించుచున్నావు

అంతఃపురకాంతలచెంత కరుగరా దనుధర్మంబు నెఱుంగవా? భళి రే! నీసాహసమున కెంతయు మెచ్చవచ్చు గాని, మజ్జనకుండగు జాంబవంతుం డిటకువచ్చెనేని నిన్నంతకనిశాంతంబున కతిథినిగా బంపకమానఁడు. బ్రదుకనిచ్ఛగలవాఁడవేని, వచ్చినత్రోవను బట్టి పొమ్ము.

కృష్ణు—ప్రేయసీ !

మ. నను నీతండ్రి వధించునంచు నిపు డన్యాయంబుగాఁ బల్కఁ గా
రణమేమో! చెలి! నేను జేయు నపకారంబెద్దియో తెల్పుమా ?
వనజాతేక్షణ ! యింతనిర్దయుడు నాపై జూపికాంక్షింపుటల్
గన, నీచిత్తము దుశ్శిలామయమహాకాఠిన్యమైతోఁచెడిన్.

నేను, మార్గవశంబున కార్యార్థమైవచ్చినవాఁడనుగాని, నీనిమిత్తమే తెంచినవాఁడనుగానే! ఇంతలో నీవు కాకతాళీయన్యాయముగ సమావేశమైతివి. ఇంతమాత్రమున నీతండ్రి నన్నేలవధియించును ? చాలుచాలు. ఇందుకే నేను భీతిల్లుదుననుకొంటివా ? నీతండ్రిసాటి బలపరాక్రమంబులు మాకడ లేవనుకొంటివా ?

జాంబ—అయ్యో !

కం. నాజనకునితో సమబలుఁ
డీజగమున లేఁడికెందు నీక్షిప్రజ్ఞలు; నీ
వేజాడనుండి
వాజాడనుఁబట్టి పోవకనగు నవేగన్.

ప్రగల్భంబులు వల్కుట మాని ప్రాణములపై నాశఁగలవాఁడవేని పరుగునఁ బొమ్ము.

కృష్ణు—ఓ కాంతాతిలకమా ! ఈబెదరింపులు చాలింపుము.

ఆ. కంసుఁడనెడు లోకకంటకుఁ బరిమార్చి
బాల్యముననె యశము వడసినట్టి

నేను నీకుతండ్రికేనా భయంపడు
నట్టివాఁడ ? వెఱ్ఱివగుదుగాక !

ఇంతేకాక మహాబలపరాక్రమ సంపన్నులగు వేనవేలు రాత్రించరవీరుల సంహారించిన నాకు నీతండ్రి యొకలెక్కయా ? బాల్యంబున పూతనం బరిమార్చిన నాకీర్తి నాలింపవే ?

జాంబ—(నవ్వుచు) ఆర్యా !

గీ. ఆడుదానినిఁ జంపితినని వచించి
సిగ్గునందక యుండుటే చిత్రమయ్యె
నీవు మగవారితోఁ బోర నేరనటుల
గానఁబడుచున్నయది నీదు ఘనతఁగాంచ.

నీ వబలనుఁజంపినవాఁడవే కాని, సింహశార్దూలాదిక్రూరమృగములను సంహారించినమేటి మజ్జనకుండగును. అట్టి పరాక్రమశాలి యెుదుటంబడితి వేని, కంఠీరవదర్శనంబైన కరీంద్రమువోలె- పలాయితుండవు గాకపోవు. నీపరాక్రమము పేరులేని ముక్కిడిరక్కసుల నుక్కడంచుటకుఁ బనికి వచ్చునేమో గాని నాతండ్రికడం జెల్లవు.

కృష్ణ—అబలా ! ఆడుదానిం జంపినవాఁడనని నీవు నన్ను తిరస్కరించు చుంటివా? అది యబలయని తలంచుచుంటివా ? పూతన బహువిధ శూరాగ్రేసరుల బలముగలది గాని, నీతండ్రివలె మృగములను జంపు కిరాతకురాలుగాదు. కాని సందర్భము నెఱుంగక నీ విట్లాడుచున్నావు.

జాంబ—అయ్యా ! నీబలపరాక్రమంబుల నాలకించుట కిచ్చటనున్నదానంగాను. నీగొప్పదనము నబలనగు నాతోఁ జెప్పుటకన్న బలశాలియగు నాతండ్రితోఁ జెప్పినప్పుడు మగతనం బనిపించును గదా ! కాలాతీతమైనయెడల నాచెలిమికత్తియలు వచ్చిచూచి, తండ్రిగారితోఁ జెప్పెదరు. అప్పుడు నీకు తప్పక ముప్పువాటిల్లు

ను. ఇంతదూరము నీమేలుగోరి వచియించితిని. కావున మార్గశ్రీ మును దాల్పక నేఁజెప్పినచొప్పునఁ జనుము.

కృష్ణు—క. నను మోహపాశములచే
తను బద్ధునిఁజేసి మన్మథ ప్రదరపయో
ధిని ముంచి యిటుల పోపొ
మ్మని చెప్పుట ధర్మమా మహాత్మ కృశింపన్.

అకారణముగ నేను నిందఁబొందుటచే, తన్నివారణార్థమై యరణ్యముం జొచ్చి యష్టకష్టంబుల ననుభవించి, యెట్టులో యీగుహం బ్రవేశించితిని. కాని నీతండ్రితో ముచ్చటించి నిన్ను పెండ్లాడ రాలేదు.

జాంబ—(స్వగ) ఈతని ముఖారవిందమును వాక్ప్రౌఢిమమును నిర్భీతియుఁ జూడ బహు ధైర్యశాలివలె గాన్పించుచున్నాఁడు. నిందనుఁ బాయుటకు వచ్చితినని వచించుట చూడ నీతఁడేదియో, కార్యదీక్షాతత్పరుఁడై చనుదెంచినట్లు గాన్పించుచున్నయది. ఈతని వృత్తాంతముం గొంత తెలిసికొనిచూచెద- (ప్రకా) పురుషపుంగవా! త్వదీయనివాసస్థలమును, పవిత్రనామధేయమును, నిందాస్పదులకుం గలహేతువును, యిట్లు వచ్చుటకుగలహేతువునుఁ దెలియపరచెదరా?

కృష్ణు—(స్వగ॥) ఇప్పటికి ధన్యాత్ముఁడనైతిని. శాంతమువహించినది. ఈమెకు నావృత్తాంతముం గొంత శ్రుతపరచెదఁగాక! (ప్రకా॥) తన్వంగీ!

సీ. ద్వారకాపట్టణనివాసుండ; యదువంశ
సంభవుండను కృష్ణనిసంజ్ఞవాఁడ;
సేనాన్వితముగఁ బ్రసేనుండు వేటకై
యడవికిఁ జన సింహమతనిఁజంపె;

తనసహోదరునినేఁ ǀ డ
సత్రాజితుండిడె ǀ సభ్యులువిన-
నీవార్త విన్నవాఁ డెల్ల నాతోఁ చెల్ప
వానిని వెనుక నే ǀ వచ్చినాఁడ

గీ. వచ్చి నినుఁగంటి నిచ్చట ǀ మచ్చెకంటి;
పచ్చవిల్తుఁడు ననుఁబట్టి ǀ బాధపెట్టఁ
జూచుచుండుట తగదిట్లు ǀ సుందరాంగి !
మారగర్వ మణంచు చకోరనయన !

సుందరీమణీ ! నిందనుఁ బాపుకొనుటకై : మందిరంబువిడచి యిందు వచ్చి నీముందర నిల్చి, నా చందమంతయు వినిపించితి; ఇఁక నీ వమందానందకందళితహృదయారవిందవై నీమృదుమధురవచనంబులచే కులగోత్రనామంబులం దెల్పి వీనులకు విందొనరింపుము.

జాంబ—యాదవకులతిలకా !

గీ. తండ్రియగు జాంబవంతుఁడు ǀ తగినవరున
కిచ్చి పరిణయమొనరింప ǀ నెంచి నన్నుఁ
బెంచుచున్నాఁడు; ప్రేమతో ǀ నుంచి యిచట
తోడిచేడెలతోఁ గూడి ǀ వేడుకలర !

నేను జాంబవంతుని తనయనగుటం జేసి, నన్ను జాంబవతియను పేరం బిలుతురు.

కృష్ణ—(స్వగ॥) సేబాస్ ! ఈయుంగనామణి యవివాహితయగు కన్యకామణియైనటు లిప్పటికి స్థిరపడినది. ఇఁక నామనోభీష్టము నెఱవేఱవచ్చును. (ప్రకా) జాంబవతీ ! కన్యవైన నీకభ్యంతరమేమి గలదు ? నీకిష్టమైన పురుషశ్రేష్ఠునిఁగాంచి వరించి పాణిగ్రహణము చేసికొన్న నీజనకుఁడు, నిన్నేమనును ? కన్యకలు తమ

మనోలగ్నమైన పురుషులను వరించుట ధర్మముగాదా ? నన్ను నీవు గాంధర్వవివాహము చేసికొని నన్నుఁ గృతార్థునిఁజేయుము.

**జాంబ**—మహాభాగా ! నాచెలిమికత్తియ లరుదెంచుచున్నవారు. వారు మనలంగాంచినచో నిరువురకునుఁ బ్రమాదముఘటిల్లును. నే నిఁకఁ బోవుచున్నాను. సెలవిండు- (క్రీగంటిచూపులంజూచుచు నిష్క్రమించును.)

**కృష్ణు**—అరరే !

క. పలుకులఁ దేనియలొల్కఁగఁ
బలుకుచు భ్రమనొందఁజేసి పయ్యెదజారన్
కులికెడి గుబ్బలతోడనుఁ
దొలకరి మెరుపనినయట్లు తొయ్యలి చనియెన్.

**ఆహాహా** ! పరిపూర్ణశశాంకబింబ మదృశ్యమైనది. ఈప్రదేశమంతయుఁ గళావిహీనమైనది. అకటా ! సమయస్ఫూర్తిగ సంభాషించినదే కాని, మనసిచ్చి మాటలాడినదికాదు. నాశ్రమంబంతయు బూడిదఁబోసిన పన్నీటిచందంబాయె. అన్యకాంతయని శంకించి మోసపోతిని. (ప్రక్కకుఁ జూచి) అదిగో దానిచెలికత్తె లరుదెంచుచున్నారు. ఇఁక జాగుచేసిన మానికంబునకుం గూడఁ జెడియెదను. (అని మణినిఁ ద్రెంచి చెంగున మూటఁగట్టుచుండగా చంచలాక్షి వచ్చి చూచి తటాలున భీతితో నిష్క్రమించును.)

[తరువాత పటాక్షేపమున జాంబవతి చకోరాక్షి ప్రవేశము.]

**చకో**—చెలీ! చెలీ ! చంచలాక్షీ ! నిలువుము నిలువుము. తండ్రిగారితో వచింపకుము.

(కృష్ణుఁడు నిష్క్రమించును.)

**జాంబ**—చెలీ ! చకోరాక్షీ ! ఇంకేమిసాధనము ! చంచలాక్షి మనపలుకు వినక వెడలిపోయినది. తండ్రిగారితో చెప్పకమానదు. ఇంకఁ

గర్తవ్యమేమి ? నామనోహరుని రక్షించుటెట్లు ? ఈవిరహావేద
న భరింపఁగలనా ? భరింపఁజాల !

చ. కలికితనంబున న్మిగుల కంతువసంతజయంత ముఖ్యులన్
గెలువఁగఁజాలునట్టి యలకృష్ణుఁడె వచ్చి నను న్వరించి, నా
చెలువముఁ గాంచి రమ్మనిన చేతను జిక్కనవాని పీడితిన్
చెలి! యిఁక నేమిసేయుదును? చిత్తము వానిని బాయకుండెడిన్.

చకో—గీ. కోరి బ్రతిమాలు వానిని జారవిడిచి
విరహమును జెందుచుంటివా ? వెఱ్ఱిదాన !
యీగుహాంతరాళంబున కెవ్వరింక
నేగుదెంచి వరించెద రెంచి నిన్ను.

చెలీ ! నే నేమిచేయుదును ? చంచలాక్షిని పోవలదని యెంతపిలిచినను లాభము గలుగకపోయె ! మీతండ్రిగారితో నీసమాచారముం దెల్పుటకై పరువిడిపోయెను.

జాంబ—(స్వగ) కటకటా ! నాతండ్రిగారు వచ్చి యామహామహున
కేమికీడు తలంచునోకదా! నామనోరథ మీడేరుటెట్లు ?

మ. అతిబాధల్ పడుచుంటి దుర్భరవియోగాంభోధిలో మున్గి నా
వెతలం బాపెడువారలెవ్వరతని న్వేఁగ రప్పించి, నా
పతిగాఁజేయు మహాత్ములేరి? యిఁక దైవంబేకదా దిక్కు సం
తతముం జింతిలుచున్న నేనెటుల మేనంబ్రాణముల్ నిల్పుదున్.

చకో—యౌవనమదంబున నట్టి మహాత్ముఁ దిరస్కరించితివి. స్వయం
కృతాపరాధం బనుభవింపక తీరదుగదా !

(తెరలో జాంబవంతుఁడు.)

చం. ఎవఁడురనీవు నాగుహకు నెంతయు భీతివహింప కొంటిమై
జవమునవచ్చి నాదుహిత శయ్యను వెల్గుచునున్న మానికం

బెవరును గాంచకుండఁగ గ్రహించి చెరంగున మూటగట్టి నా
డవు? భళి! చోరువై ఖరి- విరోడంబముతోడఁ జనంగనిత్తునే?

[ప్రవేశము:—జాంబవంతుఁడు, చంచలాక్షి.]

జాంబ—చంచలాక్షీ! ఏఁడి! వాఁడేఁడీ! ఎచ్చట నక్కియున్నవాఁడు?

చంచ—అల్లడుగో! పండ్లను నిర్భయుఁబుగాఁ గోయుచున్నవాఁడు. ఇటు రండు.

[ఇరువురును నిష్క్రమింతురు. పిదప, జాంబవంత కృష్ణులు పునఃప్రవేశము]

జాంబ—ఓరీ!

గీ. ఎవ్వఁడవు నాదుమణిఁ గొనిపోయెదీవు
విడిచిపెట్టుము మణినట ♦ వీడకున్న
నధికముష్టిఘాతములచే ♦ నంతమొంద
గా నొనర్చెద నిప్పుడే ♦ కాచుకొనుము.

కృ—ఓయీ! భల్లూకేశ్వరా!

గీ. చంపుదు నటంచునను బెదరింప నేల?
నీకు భయపడ నేల భల్లూకనాథ!
మల్లయుద్ధములో నన్ను ♦ మడియఁజేసి,
యీమణిని గ్రహియింపు మో ♦ యీబిరాన.

జాంబ—రే! రే!! నరాధమా!

గీ. ఒక్కపెట్టున నినుఁబట్టి ♦ యుక్కడంతు
పెక్కుమారులు నాతోడ ♦ ప్రేలవలదు
చక్కఁగా మణి నిటఁబెట్టి ♦ సాగకున్న
ముక్కముక్కలుగాఁ జేతు ♦ నిక్కువముగ.

(ఇరువురు నొండొరుల గవసి నిష్క్రమింతురు.)

జాంబ—అమ్మో! నాజనకుఁ డానుహాశయుం గవసెనే! అకటా! సుకుమారశరీరుఁడగు నాపతికి హాని ఘటిల్లదు గదా! దైవమా!

చకో—వచ్చిన వానిని రహస్యముగఁ గొలుతనే గాంధర్వవివాహ మాడియుండిన నింత యాపదయు గల్గియుండకపోవుగదా!

జాంబ—అబ్బా! చెలీ! చూచితివే! ఎంతఘోరమైన ముష్టియుద్ధము జరుగుచున్నదో! కటకటా! దైవమా! నాకెట్టికష్టమును గల్గించితివి? ప్రాణసమానుఁడగు మహాభాగునకును, ప్రియజనకునకును సంగ్రామము గల్గించితివా? ఏరికిని, యాపద ఘటిల్లకుండ నో పార్వతీమతల్లీ! నీభక్తురాలనగు నాపై దయఁదలంచి రక్షింపుము.

చకో—ఓహో! చూచితివే! యాదవబాలుఁడు చూపులకుఁ చిన్నవాఁడైనను, నీజనకు నెటుల నొప్పించుచున్నాఁడో!

జాంబ—వహ్వా! ఏమి యీతని బలపరాక్రమము! అసమానబలపరాక్రమోపేతుఁడగు నాతండ్రిని నొప్పింపఁగలవాఁడు ముజ్జగంబులందును లేఁడని గర్వించియుంటిని. నేఁటికి నాగర్వంబు సర్వంబును ఖర్వంబయ్యె. ఆమహాత్ముఁడెంత యుక్తియుక్తముగఁ బోరుచున్నాఁడో చూచితివే? (భయము నటించి) అమ్మయ్యో! చెలీ! నాతండ్రి యీమహాభాగుని సంహరింపఁడుగదా! నామనోహరుని హతమార్పఁడుగదా! కటకటా! ఇంకేదిదారి? నామనోహరుఁడు భూపతితుఁడు గానున్నవాఁడు. నానాథుని రక్షింపవా రొక్కరును లేరా? (నిదానముగఁజూచి ప్రమోదముతో) ఓహో! అమ్మకచెల్లా! ఈతఁ డెంతటి మాయలాఁడే! నిజముగా పడిపోవు వానివలెనే నటించి తుదకు నాతండ్రినే క్రిందపడ నేసినాఁడే!

చకో—ఇంక మీతండ్రిగారు కాళ్ళకు బుద్ధిజెప్పరుగదా! జాంబవతీ! అతఁడు పిన్నవాఁడుగాఁడే! సాక్షాజ్జగదీశ్వరుఁడనితోఁచుచున్నది. ఆతని జెట్టవట్టని నీజన్మమేలనే?

జాంబ—చెలీ! చకోరాక్షీ! రమ్మి. రమ్మి. మాతండ్రిగారు లేచినారు. వారిరువురును, మగుడ నీవిశకే వచ్చుచున్నారు. ఇఁక మనమిం దుండఁదగదు.

(ఇరువురును నిష్క్రమింతురు.)

[జాంబవంతుఁడు, కృష్ణుఁడు, పునః ప్రవేశము.]

కృ—ఓరీ! భల్లూకాధమా! మరల నదేప్రలాపసయా? ఇంకను మణిని నీకొసంగి పోవలయునుగదా? ఇదిగో! మణికి బదులుగా నేనిచ్చు బహూకృతినిఁ బరిగ్రహింపుము. (గ్రుద్దును.)

జాంబ—(దేహము తడుముకొనుచు తనలో) అహాహా!

ఉ. కాలునిరీతిఁ బొంగుచు, ప్రగల్భము జూపుచు, గాలి నవ్వుచున్
బాలునివోలె నవ్వమను భావము నాకును గేలిసేసి, ని
ర్వేలపరాక్రమంబు గనుపింప నటించుచు నున్నవాఁడు; నేఁ
డేలను వచ్చెనిచ్చటికి యెవ్వఁడొ వీఁడు? స్పృహింపదక్కటా.

క. నరుఁడైనను నాతోడను
సరిపోలఁగగలఁడె? యొంటిసాహసుఁడైనన్
కరివరదుఁడో? శంకరుఁడో?
సరసిజసంభవుఁడో? తెలియఁజాలక యుంటిన్.

ఈమహాత్ముఁ డవతారపురుషునివలెఁ గాన్పించుచున్నవాఁడు. మానవుఁడైనయెడల నిన్నిదినంబులుపోరి, నన్నింత నొప్పించి తా నంత దృఢముగఁ జెక్కుచెదరక నిలువఁగలఁడా? దివ్యదృష్టిం జూచి సర్వమును గ్రహించెదఁగాక! (కన్నులుమూసికొని యవతార పురుషునిగా నెఱిఁగి ధ్యానించిన

యములతో చేతులుజోడించి) రామా ! సకలసద్గుణాభిరామా! సీతా మనఃకువలయసోమా!

సీ. రఘువంశమున దశరథ రాజసుతుఁడవై
కౌశికుయాగంబు కాచి నాతి
శాపంబు బోకార్చి సత్కీర్తివహియించి
శివునిచాపముద్రుంచి సీతఁగూడి
పరశురాముని గర్వభంగంబు గావించి
కైకేయివరమునఁ గానకేగి
జానకినెడఁబాసి వానరాధిపునకు
జనువిచ్చి వాలిని సంహరించి
సీతక్షేమంబు మారుతి చేతఁ దెలిసి,
జలధిబాధించి రావణాసురులను ద్రుంచి
యుద్ధమునగెల్చి సతితో నయోధ్యకేగి
పుడమి నమునేలు శ్రీరామమూర్తివీవె!

(సాష్టాంగ నమస్కారములుచేసి మోకారించి కూర్చుండి)

ఉ. కన్నులు గానకేను మమకారము చేతను తప్పుజేసితిఁ
నన్ను క్షమించిబ్రోవు శరణాగతపోషణ! శత్రుశోషణా !
పన్నశరణ్యా! కంసమదభంజన! భక్తజనానురంజనా!
నిన్నెస్మరింపుచుంటిని వినిర్మలభక్తి సమన్వితుండనై.

దేవాధిదేవా! నిరంతర రామనామస్మరణానందుఁడనై కాలము గడుపుచున్న నేనొనరించిన యపరాధమును క్షమింపఁ బ్రార్థించుచున్నాఁడ!

కృ—(లేవదీసి హస్తమున శిరంబునిమిరి) జాంబవంతా! నీవు మద్భక్తాగ్రగణ్యుండవు. నీయందు దిసుమంతైన నా కాగ్రహము లేదు. తొల్లి రామావతారకాలంబున రావణవధానంతరము మద్భక్తకోటికేను వరంబులనొసంగుతరి "నీకేవరంబుగావలయు" నని

యడుగ నీవు బలగర్వితుండవై "మీతో మల్లయుద్ధ మొనరింపసంకల్పము గలదు; అట్లనుగ్రహింపు" మని వేడుకొంటివి. అట్లే నీకోర్కె చెల్లించెదనుగాని, "రాజుతో బంటు రణమొనరించుట ధర్మేతరవృత్తి యగుంగావున భవిష్యదవతారంబున నీ యభీష్టముం దీర్చెద" నని పల్కియుంటిని. తద్వాగ్దానప్రకారమే యిప్పుడీస్వల్పంబగు సంగరము ప్రవర్తిల్లెను. నారాకకు సయితము హేత్వంతర మించుకగలదు.

జాంబ—స్వామీ! ఆకారణం బెద్దియో సహేతుకంబుగాఁదెల్పి వీనులకు విందుగావింతురా?

కృష్ణ—అట్లైన వినుము.

సీ. జాంబవంతా! నేను సత్రాజితను నక్షేం
ద్రుని మిత్రవాత్సల్యకమునుఁ దలంచి
యొకదినంబున శమంతకమణి ముదమార
నిమ్మని యడుగ నా కియ్యననియె
తనతమ్ముఁ డామణి ధరియించి వేటకై
యటవికి నేగ సింహము వధించి
చనుచుండఁగా నీవు జంపి దానిని మాని
కము ప్రేమతో పుత్రికకు నొసఁగితి
వీ నిజం బెటులుండ ప్రసేనజితుని
దునిమి కృష్ణుఁడే మణిఁగొని చనియెననుచు
నింద నాపైని వైచి సందేశమంపె
వానిజాడను గనుగొన వచ్చినాఁడ.

జాంబవం—ఆహా! కాల మెంతయన్యాయముగానున్నది! (చెలికత్తెతో) చంచలాక్షీ! నీవు త్వరగా బోయి మన జాంబవతీకన్యకను దోడ్కొని రమ్ము.

కృష్ణు—(స్వగతము) హృదయమా! త్వరపడకుము. మంచిదినములు ప్రాప్తించు శుభసూచనములు గానఁబడుచున్నవి.

[జాంబవతీచంచలాక్షులు ప్రవేశింతురు.]

జాంబవం—అమ్మా! జాంబవతీ! ఇటురమ్మ. (దగ్గఱకుఁ దీసికొని) కృష్ణా!

గీ. మహిత సద్గుణ దేదీప్యమానముగను
విపులదయతోడ మాయింట విందుసేతు
దగినపరిచర్య నేసేయదగను; నాకు
కూఁతు నొసగెదఁ గొను మతిసీతిమెరయ.

(జాంబవతీ కృష్ణు లన్యోన్యకరాశ్లేష మొనరించుకొందురు.)

(జాంబవతితో) అమ్మా! జాంబవతీ!

క. శూరుఁడు జిష్ణుఁడు హరి యవ
తారుఁడు శ్రీకృష్ణమూర్తి దయగలవాఁడై
కోరికలు దీర్పఁ గల్గిన
ధీరుఁడు మగఁడయ్యె నీ యదృష్టముకతనన్.

అమ్మాయీ! ఈపూలహారమును నీభర్తకంఠమున నలంకరింపుము?

జాంబ—(సిగ్గుతో హారమును చేతదాల్చి)

గీ. పూర్వజన్మసమార్జిత పుణ్యమునను
నాకు నాథుండవై తివనారతంబు
నీవె తల్లివి; తండ్రివి; నీవె దైవ
మీవె సకలంబునాకు మహేశమిత్ర. (హారము వేయును)

జాంబవం—(జాంబవతిహస్తమును కృష్ణునిహస్తముననుంచి) కృష్ణా! మహానుభావా!

ఉ. బాలసుమీ! దయామతిని పాలనసేయుము నీవు దీని గో
పాలక! నీటముంచినను పాలనుముంచిన నీదెభార మీ

కాలఫణీంద్రవేణి ననుఁ గంపను లోపములెల్ల నెంచకే
లీలను బ్రోచుచుందువో వలక్షిత్రయభాస్వరకంబుకంధరా.

చంచ—(కృష్ణునితో సపరిహాసముగ)

ఉ. చోరునిఁ దీవ వచ్చి గుహఁ జొచ్చి చెలుల్ గనకుండ మాయచే
చారుతరైకరత్నమును జక్కని జాంబవతీశిరోమణిన్
కోరికదీరఁ గైకొని సఖుల్ గనుచుండఁగ నేగనుంటె వో
సారసపత్రనేత్ర! నిను సంస్తుతిసేయఁ దరంబె మాకికన్.

జాంబవం—నందనందనా! ఈసుందరాంగిని నీయర్ధాంగిగా నప్పగించితిని. ఎట్లు కాపాడెదవో నీదే భారము. నే నింతకన్నఁ జెప్పవలసినది లేదు. శమంతకరత్నముతోఁగూడ మత్కన్యారత్నముం బరిగ్రహింపుము.

కృష్ణ—మహాభాగ్యము. ధన్యాత్ముఁడనైతిని. మామగారూ! ఇంక మాకు సెలవుదయచేయుఁడు.

(అందఱును నిష్క్రమింతురు.)

చతుర్థాంకము.



# శ్రీకృష్ణప్రతిజ్ఞ

## పంచమాంకము.

రంగము 1. దుర్గాలయము.

[ప్రవేశము:—కైరవకంసికాదులు.]

కైర—(దుర్గ కెదురుగ నిలచి చేతులుజోడించి)

(అనుబంధము)

మాతా! సద్గుణోపేతా! శ్రీకృష్ణుఁడు మా కిరువదిదినంబులు గడువిచ్చి గుహలోఁ బ్రవేశించి, తిరిగి వచ్చెదనని పలికి నేఁటికి గడువు మీఱినది. ఇంతవఱకు మామిత్రుఁడు కష్టములను బొందుచుండెనో, కాక మహానందముననుండెనో యనుగ్రహించి, తెలియఁజేయుము లోకజననీ!

[ప్రవేశము:—నందుడు మొదలగువారు.]

నందు—మిత్రులారా! మన మీదుర్గాంబను ప్రార్థించినచో శ్రీకృష్ణుని సమాచారము నెఱిఁగించును. భూతభవిష్యద్వర్తమానముల నెఱింగిన యీదేవికిఁ దెలియని విశేషంబు లుండునా? కావున పోయి ప్రార్థింతము రండు. (ముందుజూచి) కైరవా! కంసికా! మీ రిచ్చటనుంటిరేమి? మీమిత్రుఁ డెచ్చట నున్నవాఁడు? మీతో గలసియుండకపోవుటకుఁ గారణమేమి?

కైర—అయ్యా! సత్రాజిత్తువేచిన నిందానివారణార్థము ఘోరారణ్యాంబునకు మేము కృష్ణునితో నరిగి, ప్రసేనజిత్తుజాడలను శక్తివంచన లేక శోధించి, కట్టకడకు అడుగులజాడ ననుసరించి విగతజీవి

యగు ప్రసేనజిత్తుజాడల గాంచితిమి. అచటినుంటి పోవంబోవ నొకమృతసింహకళేబరంబు గాన్పించె. తచ్ఛవంబులు రెంటికడను శమంతకమణి గాన్పింపమిం జేసి, మణి నెట్లైన సంగ్రహింపనెంచి, మరల నడుగులజాండంబట్టి, వెంబడించితిమి. ఆయడుగులజాడ మమ్మొకగుహాసమీపమునకుం గొనిచనియెను. తోడనే కృష్ణుం డిరువదిదినములవరకును మమ్మచటం గాచియుండ నియమించి యాగుహం బ్రవేశించి యింతవఱకును మఱలిరాండయ్యెను. వెనువెంట నుండుమని మే మెంతబ్రతిమాలినను వినక, తా నందుబ్రవేశించుటేకాక, గడువుమీఱినపిదప నింటికిం బోవలసి నదేకాని, యాగుహాతలంబు నెంతమాత్రముం బ్రవేశింపరాదని, మిత్రుండు శాసించుటచే నాతనియాన మీఱంజాలక, గడువుకాలము మీఱునందాక నందేయుండి, పిదప విభ్రాంతులమై సంతాపముతో మరలి మామిత్రుని క్షేమసమాచారములను దెలుపవలయునని యీజగజ్జననిం బ్రార్థించుచుంటిమి.

నందు.—కైరవా! మీఱందఱుం గలసి ఘోరాటవికిం జని, యందు నాకన్నతండ్రి నచ్చట విడిచి వచ్చితిమని యుచ్చరింప మీకు నో రెట్లువచ్చెను? ఇదియేనా మీమిత్రవాత్సల్యలక్షణము? విన్నవారు విశ్వసింతురా?

కైర.—(స్వగతము) కటకటా! మే మాతని వెనువెంట వలదనుచున్నను చను టెంతబుద్ధిహీనతయయ్యెను!

సీ. గణపతి నింనుంచు [illegible] గని హసింపంగనేల?
భీమేశురాణి శపింపనేల?
శపియింపంగా నేమి? [illegible] సరవి సత్రాజిత్తు
ఘురి వె[illegible] నింగ[illegible] మోపనేల?

మోపిన శ్రీకృష్ణమూర్తి కానకు నొంటి
జనుచుండఁగా మేము జనగనేల?
చని మణి నరయుచో జాడఁ గాంచఁగలేక
హరి గుహఁజొచ్చి పోవమ్మనఁగనేల?
పొమ్మనిన మేము మిగుల దుఃఖమ్ముతోడ
నంమునకుఁ దెల్పఁగా మమ్ము నిందజేసె
చేసినందుకు నిందింపఁ జెల్ల దింక
ధాత వ్రాసిన లిపి జవదాటదరమె?

కంసి—అయ్యా! మాధవుఁడు మమ్ము గుహఁజొరవలదని నొక్కి వక్కా ణించిన నాతనియాజ్ఞ నుల్లంఘించి, యందు మేమునుఁ జిక్కు వడియుండిన మీ కీవర్తమానమైన నెఱింగించువారుండరుగదా! మమ్మేల నిందించెదను?

నందు—హా! పరమేశ్వరా! మాకృష్ణున కెట్టియాపదయు రానీయకుండ కాపాడుము. (కైరవునితో) కైరవా! ఇంక మనమందఱమును దుర్గామహాదేవినిఁ బ్రార్థించుటయే కర్తవ్యము.

కైర—మంచిది. అందులకే మేమును నిటకు వచ్చితిమి.

నందు—(దుర్గాదేవికి నమస్కరించి) తల్లీ! దుర్గాంబా! నిరంతరమరంత చింతాకరపరహింసాభిలాష సకల జగజ్జాలభయంకరనిరుపమాన బలపరాక్రమ శౌర్యధైర్యవీర్యగాంభీర్యాది సుగుణపరంపరాన్విత చండాసురభండాసురముండాసుర ప్రముఖ రక్షోవీరులం ద్రుంచి జగంబుల రక్షించినతల్లీ! భక్తజనకల్పవల్లీ! సతీమతల్లీ! మాకృష్ణ మూర్తి ఘోరాటవి కరిగి యింతవరకు రాడాయె. ఆతనివృత్తాంత మించుకంతైనఁ దెలియలేదు. నీవు భూతభవిష్యద్వర్తమానముల నెఱింగినమహాశక్తివి గాన, మాముద్దులకృష్ణునివార్త సవిస్తరము దెలియఁబరచి మాకుం గలదుఃఖ మపనయింప వేడుచున్నాఁడ.

(దుర్గాదేవి ప్రత్యక్షమగుచున్నది.)

అందఱు— -: దండకము :-

శ్రీమన్మహాదేవదేవేశురాణీ! పురాణీ! మహాఘోరదుర్వార మాయాబలోపేత మత్తేభనక్తంచరధ్వంసినీ! ముక్తికాంతామణీ! శ్రీజగన్మోహినీ! నీకుపాదాంబుజాతద్వయీ నిత్యసందర్శన స్పర్శనాఖండసేవాస్తవాసక్త చిత్తాబ్జపంకేజజాతేంద్రముఖ్యామరుల్ నీప్రభావంబువర్ణింపఁ గాఁజాలరే నెంతవాఁడర్క భవానీసతీ! చిన్నికృష్ణుండు ఘోరాటవిం జొచ్చి రాఁడాయె నేమయ్యెనో తెల్పి మాదుఃఖముల్మాన్పి మన్నింపవే! శాంకరీ! లోకమాతా నమస్తే నమస్తే నమః.

దుర్గ—యాదవులారా! రుద్రముఖ్యదేవాదులకును నజేయుండును మహాబలపరాక్రమసంపన్నుఁడు నగు నాదివిష్ణుండగు శ్రీకృష్ణున కెట్టియిక్కట్టులైనను రానగునే? అల్లదిగో మణితోడను కాంతామణితోడను గోపాలచూడామణి వచ్చుచున్నవాఁడు. ఇంక మీ రానందము నొందుఁడు. మీకు సమస్తమంగళంబులు గల్గుఁగాక!

(అంతర్ధానయగును.)

[శ్రీకృష్ణుఁడు జాంబవతితో ప్రవేశము.]

నం—(కృష్ణుని కౌగిలించుకొని) నాయనా! కృష్ణా! నిందఁ బాపుకొన నరణ్యంబున కరిగి బొందిఁ బాపుకొంటివేమోయని కుందుచుంటి మిరాతండ్రీ! ఇంతకాల మెటనుంటివి? ఈలతాంగి యెవ్వరు? శమంతకమాణిక్యము చిక్కినదాయేమి? త్వరగా నెఱిగింపుము.

కృ—నాయనా! నందా! నేను నిందానివారణార్థ మరణ్యమునం బ్రవేశించి గుహాప్రవేశం బొనర్చినంతదనుక జఱిగిన కథను నామిత్రులు మీకెఱిగించియే యుందురు. తరువాత మహాపరాక్రమ నిధి

యగు జాంబవంతుఁడు సింహమును సంహరించి యామణిని స్వీకరించి, తనకుమార్తెయగునీజాంబవతీకన్యక శయ్యోపరితలంబునఁ గ్రీడాకందుకమువలె గట్టియుంప తన్మణిని నేనుగ్రహించి గైకొని వచ్చుచుండఁ జెలికత్తెలవలన నీసమాచారంబును దెలిసికొని జాంబవంతుఁ డుగ్రుఁడై వచ్చి నన్నుఁ బట్టుకొని యిరువది దినంబులవఱకును నాతో ముష్టియుద్ధం బొనరించి బలహీనుఁడై యోగదృష్టిచే నన్ను కృష్ణునిఁగా నెఱింగి పట్టరాని యానందముతోఁ దనకుమార్తెనుఁ గానుకగానిచ్చి వివాహం బొనరించి యీశమంతకమణీసమేతంబుగా నాతో నంపెను. ఆజాంబవతియే యీబాలాలలామము.

జాంబ—మామగారూ! నమస్కారము.

నం—తల్లీ! చిరంజీవివై సుపుత్రవతి వగుదువుగాక!

[సత్రాజిత్తు విచారముతో ప్రవేశము.]

సత్రా—(లజ్జాపరవశుఁడై కృష్ణునితో)

సీ. వసుధలో దేవకీ ౯ వసుదేవులకుఁ బుట్టి
నందయశోదల ౯ మందిరమునఁ
బెరిగిపూతనఁబట్టి ౯ పరిమార్చి భీకర
శకటాసురాది రాక్షసులద్రుంచి
భక్తుల మొరవిని ౯ బాధలు దొలగింప
గోవర్ధనంబను ౯ కుధర మెత్తి
కలుషాత్ముఁడయినట్టి ౯ కంసునిఁ బరిమార్చి
గొల్లభామల కోర్కె ౯ లెల్లఁ దీర్చి
ప్రేమరుక్మిణీకాంతను ౯ బెండ్లియాడి
నళిన సంభవ ముఖ్యు లొనర్చినట్టి

సంస్తుతులుగాంచి లోక రక్షణముకొఱకు
నవతరించిన నారాయ ణాత్మవీవ!

(చేతులు జోడించి)

ఉ. కల్లలువల్కి పాపమొడిఁగట్టితి, నన్ను క్షమింపుమింక, ను
త్ఫుల్లసరోజనేత్ర! ఫణిభుగ్వరవాహ ప్రశాంతరూప! నా
యల్లరిచే త్వదీయ యశమబ్జ భవాదిసురేంద్ర ముఖ్యులం
దెల్లెడ వ్యాప్తమై తుదకు నింపు వహించు మహాత్తరంబుగా.

నందనందనా! నీవు మణిసమేతంబుగా కాననమునుండి వచ్చితివని చారులవలనవిని, నిందాపహారణార్థమై నీవందిన శ్రమనాలించియు మూఢాత్ముండనై యిల్లెద్దియో మాయంబన్నితివని దురూహామునొందితి; విశ్వసింపనైతిని. అంత నశరీరవాణి నన్నుగాంచి,

"గీ. జాంబవంతుండు కృష్ణు ప్రజ్ఞలకుమెచ్చి
తనకొమార్తెను మణిసమేతముగ నిచ్చి
ప్రేమతో దనగుహాయందు పెండ్లిజేసి
పంపినాడిది సత్యంబు పార్థివేంద్ర!"

యనిపల్కెను. తోడనే పశ్చాత్తాపపడి మిమ్ములను క్షమార్పణము గోరుకొన నిటువచ్చితిని. నాతప్పులను మన్నింప వేడుచున్నాను.

కైర——రాజా! సత్రాజిత్తూ!

గీ. అప్పుడే నేను "శ్రీకృష్ణుఁ డట్టివాఁడు
కాడు నిందింపఁగూడ దక్రమ'' మటంచు
నెంతజెప్పిన వినకను పంతగించి
యన్నవాక్యము లిప్పు డేమయ్యెనయ.

కృష్ణు——సత్రాజిన్నరపాలా! పార్వతీదేవి శాపప్రభావంబున చవితిచంద్రునిఁ గాంచుటచేత, నాకీనింద సంభవించెను. కాని, దానికి

నీ వెంతమాత్రమును కారకుండవుగావు; అపనిందను దప్పించు
కొన నే నింతశ్రమవహించితినిగాని వేరుగాదు.

సత్రా—

ఉ. నాకొకకోర్కెయున్నయది; నా ప్రియపుత్రిక సత్యభామనుం
జేకొని, పెండ్లియాడుము యశోశేషముదంబున శాస్త్రరీతిగా
నీ కనుకూలత న్మెలఁగు నిత్యము రుక్మిణితోడ సాటిగా
నే కనుచుండఁగావలయు నెట్టులుగాంచెదొ నీదె భారమా.

నేఁ జేసిననేరమును క్షమించి నాకోరిక నెఱవేర్చి నావంశమును తరింపఁ
జేయవేడెద.

కృష్ణ—నాయందు భక్తియుక్తముగా నున్నవారి కోర్కెల నెఱవేర్చు
టయే నాసంకల్పము. కాన మీయిష్టానుసారముగా నటులనే
మీకొమార్తె నిచ్చి వివాహ మొనరింపవచ్చును.

సత్రా—(నందునితో) బావగారూ!

గీ. బ్రాహ్మణులజేరి మాసత్య భామ కృష్ణ
మూర్తులకుఁ దగినట్టి ముహూర్త మొకటి
యంబుజారాతితారాబలాన్వితముగ
త్వరితగతి నిర్ణయింపఁగ వలయునయ్య.

నందు—కంసికా! నీవు సత్వరంబుగ నరిగి ముహూర్తనిర్ణయం బొనరిం
చుటకు మన గర్గాచార్యులవారిం దీసికొనిరమ్ము.

కంసి—(నిష్క్రమించి గర్గాచార్యునితో పునఃప్రవేశము.)

నందు—స్వామీ! ఆచార్యోత్తమా! నమస్కారము.

గర్గా—సమస్త సన్మంగళానిభవంతు- మనస్సంకల్పసిద్ధిరస్తు-

నందు—ఆచార్యోత్తమా! మాకృష్ణమూర్తికి సత్రాజిత్తు మహారాజు
గారి కుమార్తెను సత్యభామ నిచ్చి పాణిగ్రహణ మహోత్సవ

మొనరింప నిశ్చయించితిమి. కావున మీరు శుభలగ్నంబు నొం
డు నిర్ణయింపవలయును.

గర్గా—(పంచాంగమును విప్పి పరిశీలించి) అయ్యా! ఈదుందుభినామ
సంవత్సర మాఘశుద్ధ యేకాదశీ భానువారము రాత్రి యిరువది
గడియల ముప్పది విఘడియలవేళకు మృగశీర్షానక్షత్ర వృశ్చిక
లగ్నమందు చిరంజీవులైన శ్రీకృష్ణమూర్తివారికిని సత్యభామా
దేవిగారికిని చంద్రతారాబలయుక్తమైన శుభలగ్నము గలదు.

నందు—(సత్రాజిత్తుతో) బావగారూ! ఇదియే శుభలగ్నము. మే మీ
శుభముహూర్తమునకు వివాహమున కేతెంచెదము. మీరును
ప్రయత్నంబున నుండనగును.

సత్రా—చిత్తము. (సత్రాజిత్తొకవైపునను మిగతవారు మరియొకవైపు
నకును నిష్క్రమింతురు.)

తెర వ్రాలును.

---

రంగము. 2.

ప్రదేశము —రాజవీధి.

[ప్రవేశము:—వేంకటశాస్త్రి, సుబ్బావధాని.]

వేంక—సుబ్బావధాన్లుగారూ! సత్రాజిత్తు మహారాజుగారికుమార్తె
సత్యభామను, శ్రీకృష్ణమూర్తివారికిచ్చి మాఘశుద్ధ యేకాదశీ
భానువారమునాడు వివాహము చేస్తారట! ఆవివాహములో
పీసె పీసె బూరలు- పెద్ద పెద్ద బొబ్బట్లు పిండివంటలూ లాడు
జిలేబీ మిఠాయీలూ మొదలైనవానితో సంతర్పణజేసి మొ
హరీలు కాసులు- వరహాలు శమాలూలు తరగతివారీగా సంభా
వనలిస్తారట! అచ్చట మొదటి తరగతి సంభావన మాకుము
డుఘుంది.

సుబ్బా—ఆలాగెప్పుడూ కాదయ్యా! వేదంచదువుకున్న ముండావా ణ్ణిగనక మొదటితరగతి సంభావన నాకు ముడుచుతుంది. శాస్త్రం చదువుకున్నారుగనక మీకు రెండోతరగతే గతి.

వేంక—వేదంచదువుకున్న వాళ్లు యెక్కడజూచిన సీమనేపాళపు పొద లల్లాగు మాడయిస్తే మహిషదానమైనా పడుచూ వూరికి తొం భైమంది వుంచారు. శాస్త్రం చదువుకున్న మాలాంటివారా వూరికొక రిద్దరైనా వుండడంకష్టం. అందుచేత, శాస్త్రం చదు వుకున్నవారిని గౌరవించినట్టు వేదం చదివినవాళ్లని యీరోజు ల్లో గౌరవించడంలేదు- శాస్త్రం పురుషకారమైన విద్యకా దటయ్యా!

సుబ్బా—వేదం బ్రహ్మవిద్య, లోకంలో వేదశాస్త్రాలంటారు గాని శాస్త్రవేదాలనరు- అందుచేత చదువుకున్నవాణ్ణవడంచేత మొ దటిసంభావననాది.

వేంక—అలాగైతే లోకంలో వేషభాషలు స్త్రీపురుషులు పేడా బెల్లం అంటారుగదా మీరు చెప్పినట్లైతే- యీవుదాహరణ ప్రకారం ముందు శద్దాలమొక్క గౌరవంమీకు జరుగుతుంది.

సుబ్బా—అయ్యా! మేముచదువుకున్నది వేదం. దానికి నీచోపమా నాలు పనికిరావు- నీవేమంటే అనుకో! ముందు గౌరవంమా త్రంనాదే! తప్పదు.

వేంక—వేదముచదివి విద్యారణ్యభాష్యం చదివి, వేదార్థం చెప్పేవేద పండితులగు, విశ్వరూపాచార్యులవారివంటి మహనీయుల కట్టి గౌరవము జరుగుచుంది. అర్థమించుకైనను దెలియక ఆడవాళ్లు పాటలు నేర్చుకున్నట్టు- పూజ- పుణ్యాహవాచనము- రెండా శీర్వచనపు ముక్కలు- నేర్చుకొని సంతకమైనా చేయలేని మీ బోటివారికి చకారగుళ్ల గౌరవమే జరుగుతుంది. శాస్త్రం చదు

వుకొని సభలలో వాక్యార్థముచేసే మాబోటి తర్క వ్యాకరణ పండితులకే ప్రథమగౌరవం.

సుబ్బా—మావంటి వేదంచదువుకున్నవారికి నమస్కారాలు- మీవంటివాక్యార్థాలు చేసేవాళ్ళకి తిరస్కారాలు. వాదముఖమైనప్పుడు అట్టెక్కంగూడాగుణిస్తారు.

వేంక—ఇదంతా యెందుకయ్యా! రేపు జరగబొయ్యే వివాహమునకు వుభయులమూ వెళ్ళాముగదా! ఎవరికిముందు సన్మానం జరిగేది తెలుస్తుందిగా! నీకు భోజనందగ్గరా మాకుసభలలోనూ యెలాగూ గౌరవము జరుగకమానదు- పద, పద.

(ఇరువైపుల నిష్క్రమింతురు.)

## రంగము. 3.

### ప్రదేశము—కల్యాణమంటపము.

[నందుడు కృష్ణుడు-గర్గాచార్యులు-సత్యభామ బ్రాహ్మణులు చెలికాడు మొదలగువారు ప్రవేశము.]

గీ. మహిమజూపిరి యోగులు కామినివరులు
పరిణయమునకు బ్రహ్మయేకరణి దీని
జతురమతితోడ నాయదృష్టమున నాపె
జనకుడేవచ్చి నాకిచ్చెసమ్మోదమున.

చిరకాలమునుండియు నీమెరూపరేఖావిలాసాతిశయములు విని మదీయహృదయాంతరాళమ్మున లగ్నమై యెన్నడు దర్శనభాగ్య మబ్బునో యని యువ్విళ్లూరుచుండ నేటికి వారే నాకొసంగుటచేత సంకల్పసిద్ధుండనైతి.

సత్య—(సిగ్గు నభినయించుచు ముందునకు రాకుండును.)

కృష్ణు—ఆహా ! యేమి యీసుందరాంగి ముఖారవింద సౌందర్యము ! ఇందుచేతనే—

సీ. సఖియనెమ్మోముతోఁ సాటిరాజాలక
దినదినంబును శశి తనటఁ జెందె,
కలికిముఖాం చితకళలతో సరిరాక
జలజారిమబ్బు లోపలనుదాగె
కంజాక్షివదన ప్రకాశంబునకు నోడి,
జాబిల్లి మేన మచ్చనువహించె
వనితాస్య మంనున్న వక్త్రమువఁ బరికించి
కమలారిలజ్జఁ గరిఘటిల్లె
యిన్నిటికి నోడి చంద్రుండు ఖిన్నుఁడగుచు
నున్నతరిచే మొ రాహువుతన్ను మ్రింగె
నెలఁతనెమ్మోము గాంచివర్ణింపఁదరమె
ధాతకైనను వానిముత్తాతకైన.

(సత్యభామను శ్రీకృష్ణమూర్తిసరసనుఁ గూర్చుండఁబెట్టి వివాహము జరుపుచుండఁగా- కృష్ణుఁడు పుష్పహారముఁ దాల్చి.)

గీ. అగ్నిసాక్షిగవిన్నుఁ బెండ్లాడి నీకు
విభుఁడనైతినిగాన నీవిడ నెపుడు
నాదుప్రాణములెల్ల నీమీఁదనిలిపి
నీయభీష్టము చొప్పన నేఁ జరింతు.

(బ్రాహ్మణులు యథోక్తముగా మంత్రములు చదివి కల్యాణము చేయింతురు.)

కృష్ణు—పార్వతీదేవిశాపము నావంటివానికే దుర్భరమై యష్టకష్టముల ననుభవింప వచ్చినదన నిఁక మనుష్యమాత్రుల మాట యేమికా

వలయును? ఇంతటినుండి యష్టకష్టముల ననుభవింపకుండ జనులకు వరంబిచ్చుచున్నాఁడ !

గీ. భాద్రపద శుద్ధ చవితిని భక్తితోడ
నీకథను విన్నఁ జదివిన లోకులకును
చందురునిఁ గాంచినట్టి యాపనిందబోయి
ధన్యులయ్యెద రాచంద్రతారకముగ.

భరతవాక్యము.

కవివరులెల్ల సౌఖ్యములు గల్గి సుఖింతురుగాక ! భూమిశేధవులు ప్రజన్ ప్రజావలివిరోధంబున బ్రోతురుగాక ! పండితప్రవరులు మంగళంబును శుభంబని యందురుగాక ! నిత్యమీయవనిని నిట్టినాటకము లాదరముగనుఁగాక ! నెల్లెడన్.

అందఱు——తథాస్తు. తథాస్తు.

మంగళము.

మంగళము నీకు పాపతమఃపతంగ !
మంగళము నీకు శాత్రవమదవిభంగ !
మంగళము నీకు సర్వసంపత్ప్రభాంగ !
మంగళము నీకు మూషికామలతురంగ !.

తెర వ్రాలును.

శ్రీకృష్ణప్రతిజ్ఞ పంచమాంకము.

సర్వమును, సంపూర్ణము.

---

# ఆంధ్ర నాటకములు.

| | | | |
|---|---|---|---|
| మహానంద శ్రో. సీ. | 0-12 | బొబ్బిలియుద్ధము శ్రీ. కృ. | 1- 0 |
| శ్రీకృష్ణప్రతిజ్ఞ సు. క. | 0-12 | కుశలవ జ. ల. | 0-12 |
| పద్మవ్యూహము మ. న. | 1- 0 | విచిత్రచిత్రమాల అ. సో. | 0-12 |
| ఉషాపరిణయము డిటో | 0-12 | సత్యహరిశ్చంద్ర సో. రా. | 1- 0 |
| రామదాసు గా. సూ. | 0-12 | ఆలీబాబా 40 దొంగలు | 0-12 |
| జయంతజయపాలము గ. కా. | 0- 8 | ఏకచ్ ప్యాలా సాంగ్సు ప్ర. గ. | 0-12 |
| పాండవాజ్ఞాతవాసము చె. వేం. | 0- 8 | రామదాసు రా. నా. | 1- 0 |
| కనకతార మ. చం. | 0-12 | సంపూర్ణరామాయణము అ. సో. | 1- 0 |
| సతీఅనసూయ అ. సో. | 0-12 | భక్తప్రహ్లాద కొ. గో. | 0-12 |
| తెనాలిరామకృష్ణ చి. సో. | 0- 8 | | |

# డిటెక్టివ్ నవలలు.

| | | | |
|---|---|---|---|
| బంగారు బరిణె పా 1 | 1- 0 | చోరాగ్రేసర చక్రవర్తి | 0-12 |
| డిటో రెండవభాగము | 1- 0 | గజదొంగ | 0-12 |
| సుడిగాలి పా 1 | 1- 0 | రూపసుందరి | 0-12 |
| సుడిగాలి పా 2 | 1- 0 | సరళ | 0-12 |
| రక్తజ్వాల పా 1 | 0-12 | విషజ్వాల | 0-12 |
| రక్తజ్వాల పా 2 | 0-12 | ఘోరకలి | 0-12 |
| మండ్రగబ్బ పా 1 | 0-12 | శిశుహత్య పా 1 | 1- 0 |
| మండ్రగబ్బ పా 2 | 0-12 | శిశుహత్య పా 2 | 1- 0 |
| యమదూత | 1- 0 | శిశుహత్య పా 3 | 1- 0 |
| పేటికాంతర శవము పా 1 | 0-12 | హత్యావినోది | 0-12 |
| డిటో పా 2 | 0-12 | ఇందిర | 1- 0 |
| భయంకరనారీపిశాచి | 0-12 | వాడే వీడు | 0-12 |
| ప్రతాపదౌర్జన్యము | 0-12 | హత్యా విచారము | 0- 6 |

# చరిత్రాత్మకమైన నవలలు.

| | | | |
|---|---|---|---|
| వనదుర్గము | 1- 0 | మానసింగు | 1- 0 |
| తపోవనము | 1- 0 | కిశోరి | 1- 0 |
| జపమాలిక పా 1 | 1- 0 | వక్రరేఖ | 1- 0 |
| జపమాలిక పా 2 | 1- 0 | తానీషా | 1- 0 |

---

వలయువారు:- కురుకూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

## బి. బాలాజీదాసుగారిచే రచించబడిన హరికథలు.

| | | | |
|---|---|---|---|
| సంగ్రహరామాయణము | 1-0 | దయాకర విజయము | 0-8 |
| కుశలవ విజయము | 0-8 | సూరదాసు చరిత్రము | 0-6 |
| గయోపాఖ్యానము | 0-8 | పురందరదాసు చరిత్రము | 0-6 |
| ప్రియంవదా చరిత్రము | 0-6 | కర్ణానందదాయిని (పద్యములు) | 0-6 |
| జయప్రద లేక పురూరవ | 0-8 | హరికథేతిహాససమంజరి | |
| త్రిశంకువిజయం | 0-8 | 1 వ భా॥ (పద్యములు) | 0-6 |
| నలచరిత్ర | 0-8 | 2 వ భా॥ (కీర్తనలు) | 0-6 |
| సీతాకళ్యాణము | 0-8 | కుచేలోపాఖ్యానము | 0-6 |
| రుక్మాంగద చరిత్రము | 0-8 | శశిరేఖాపరిణయము (హరికథ) | 0-8 |
| ద్రౌపదీ మానసంరక్షణము | 0-6 | రామదాసు చరిత్రము చ. రా. | 0-6 |

## ఆదిభట్ల నారాయణదాసుగారిచే రచించబడిన హరికథలు.

| | | | |
|---|---|---|---|
| జానకీ శపథము | 1-0 | భీష్మచరిత్రము | 0-8 |
| రుక్మిణీకళ్యాణము | 0-12 | అంబరీషచరిత్రము | 0-8 |
| మార్కండేయ చరిత్రము | 0-12 | గజేంద్రమోక్షము | 0-8 |
| హరిశ్చంద్రోపాఖ్యానం | 0-12 | ప్రహ్లాదచరిత్రము | 0-8 |

పై ఎనిమిది పుస్తకములు కలసిన క్యాలికో బైండు. 5-8

## స్త్రీ ల పా ట లు.

| | | | |
|---|---|---|---|
| ఘాలి సుబ్బారావు పాటలు | 0-12 | పన్నెండ్రాజుల కథలు | 0-12 |
| డిటో పా 2 | 0-12 | మహాపతివ్రతల కథలు | 0-8 |
| వేడుక పెండ్లిపాటలు | 0-8 | గాన విద్యాతరంగిణి | 1-0 |
| మహిళా మనోరంజని | 0-5 | కుశలవ యుద్ధము | 0-8 |

## వి వి ధ ర క ము లు.

| | | | |
|---|---|---|---|
| దస్తావేజులమతలబు | 0-12 | ఇన్కంటాక్సు గైడ్ | 2-0 |
| హిందుస్తానీ తెల్గుబోధిని | 0-6 | ఆధ్యాత్మరామాయణ | 0-8 |
| దాష్టికపంతులు ఫార్సు | 0-4 | భగవద్గీత (పద్యం) | 1-0 |
| వేమనరత్నములు | 0-12 | రామాయణభజనకీర్తనలు | 0-4 |
| భాగవతరత్నములు | 1-0 | హిందీబాలశిక్ష | 0-8 |
| దండకరత్నములు | 0-6 | అదృష్టదీపిక | 0-8 |
| సమయోచితపద్యరత్నావళి | 0-6 | జ్యోతిషఫల ప్రదర్శని | 0-12 |
| అద్వైతబోధిని | 2-8 | భట్టి విక్రమార్కుల కథలు | 0-12 |

వలయువారు:- కురుకూరి సుబ్బారావు, సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

